Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎవరికోసం వచ్చినారో
ఎరుగ జెప్పండీ

పంపినవారు:
క. గౌ. జానకి, ఇ. తాండ్రపాడు

# చందమామ

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు



ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.









కరకరలాడే...





తాజా...

రుచికరమైన...

శ్రేష్ఠమైన బిస్కట్లు

# బ్రిటానియా







BBX 31 TG



'ఒహో! లైఫ్‌బాయ్ సబ్బుతో
ఇప్పుడు స్నానం చేయుటఅవుసరం'
-అది సంతృప్తి కరమైన
శుభ్రతాభావమును కలిగించును!
LIFEBUOY SOAP
LIFEBUOY
SOAP
LIFEBUOY SOAP
భారత దేశంలో తయారుచేయబడినది
L. 259-50 TL

# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

గౌతమ బుద్ధుడి 2500 వ జయంతి వార్షికోత్సవం మే 24 తేదీనుంచి జరుగుతున్నది. సారనాథ్‌వద్ద జరుగుతున్న ఈ ఉత్సవంలో ఇండియా, చైనా, సింహళం, ఇండొనీసియా, బర్మా మొదలైన అనేక దేశాలు తమ ప్రతినిధి వర్గాలను పంపి పాల్గొంటున్నాయి.

అనేకమంది ప్రవక్తలూ, బోధకులూ ఉద్భవించడానికి ప్రాచ్య సంస్కృతి కారణభూతమయింది. బుద్ధ భగవానుడు "ఆసియా జ్యోతి" అని ప్రపంచ మేధావులనేకులు ప్రవచించి ఉన్నారు.

అదృష్టవశాత్తూ మన దేశం బౌద్ధసంస్కృతీ చిహ్నలను పునరుద్ధరించుకున్నది; ఏమంటే, ఈ చిహ్నలు అంతశ్శాంతినీ, బహిశ్శాంతినీ సూచిస్తాయి.


జూన్ 1956



సంపుటి 18
సంచిక 6

# అట్టివాది బొమ్మ

ఒకనాడు దూర్వాసుడు పదివేలమంది శిష్యులతో దుర్యోధనుడికి అతిథిగా వచ్చాడు. దూర్వాసుడు పరమ కోపిష్ఠి. ఏమాత్రం తప్పు జరిగినా శపించేస్తాడు. అందుచేత దుర్యోధనుడు ఆ మునిపట్ల ఎంతో శ్రద్ధాభక్తులు చూపి అయనను చాలా సంతోషపెట్టాడు. "దుర్యోధనా, నాకు అతిథ్యం ఇవ్వటంలో నీవు చూపిన భక్తికి సంతోషించాను. ఏమి వరం కోరుతావో కోరుకో!" అని దూర్వాసుడన్నాడు.

"స్వామీ! నా దాయాదులైన పాండవులు కామ్యకవనంలో వుంటున్నారు. మీరు మీ శిష్యగణంతో అక్కడికి వేళగానివేళ వెళ్ళి అతిథ్యం కోరండి. ఇదే నా కోరిక," అన్నాడు దుర్యోధనుడు.

దూర్వాసు డిందుకు ఒప్పుకుని, తన పదివేలమంది శిష్యులతోనూ బయలుదేరి, కామ్యక వనంలో పాండవులుంటున్న చోటికి మధ్యాన్నం దాటి నాక చేరుకున్నాడు. ధర్మరాజు తన తమ్ములతోసహా దూర్వాసుడికి నమస్కరించి స్వాగతం చెప్పాడు.

"ధర్మరాజా, నేనూ నా శిష్యులూ ఇంకా భోజనం చెయ్యలేదు. మేము గంగకు వెళ్ళి స్నానంచేసి వచ్చేలోపుగా మాకు భోజనం సిద్ధంచేయించు," అంటూ శిష్యగణంతోసహా, సమీపంలోనే వున్న గంగానదికి వెళ్లిపోయాడు.

అప్పటికే ద్రౌపది అక్షయపాత్రలో అన్నం వండి తన భర్తలకూ, అతిథులకూ పెట్టి, తాను తిని అక్షయపాత్రను కడిగివేసిందికూడా. దూర్వాసుడికీ, అయన శిష్యులకూ ఎలా భోజనం పెట్టాలో తోచక అమె కృష్ణుణ్ణి ధ్యానించింది.

వెంటనే శ్రీ కృష్ణు డక్కడికి వచ్చాడు. "నాకు అకలి దహించుకు పోతున్నది. వెంటనే భోజనం పెట్టు," అని అయన ద్రౌపది నడిగాడు. "నీవే నన్ను పరీక్షిస్తున్నావా? అక్షయపాత్ర కడిగేశానుకూడా!" అన్నది ద్రౌపది.

"ఏ మూలనన్నా ఒక్క మెతుకు ఉండకపోదు. చూసి నాకు పెట్టు," అన్నాడు శ్రీకృష్ణుడు. అక్షయపాత్ర తెచ్చి ద్రౌపది కృష్ణుడికి చూపింది. శ్రీకృష్ణుడు పాత్రనుంచి ఒకేఒక మెతుకు తీసి నోటవేసుకున్నాడు. మరుక్షణమే దూర్వాసుడికీ, అయన శిష్యులందరికీ పొట్టలు ఉబ్బరించి, త్రేపులు అరంభమయాయి.

"ఈ స్థితిలో మనం వెళ్ళి ధర్మరాజు పెట్టే భోజనం ఎలా తిన గలం? తీరా వంట చేయించి తినకపోతే అయన శపించగలడు!" అనుకుంటూ, వారు గంగలోనుంచి బయటికి వచ్చి పాండవులవద్దకు రాక అటే వెళ్లిపోయారు.

# అఖండ విజయం

పూర్వం కాశీరాజ్యంలో గంగాతీరాన ఒక నిరుపేద ఉండేవాడు. అతనికున్న ఆస్తియావత్తూ ఒక పారమాత్రమే. ఈ పారతో అతను మడులు తవ్వి, కూరగాయలు పండించి, వాటిని అమ్మగా వచ్చిన కొద్ది డబ్బులతో అతికష్టంమీద పొట్టపోసుకుంటూ ఉండేవాడు.

ఈ విధంగా కొంతకాలం జీవితం వెళ్లబుచ్చాక ఆ పేదవాడికి వైరాగ్యం కలిగి, పరమార్థచింత పట్టుకున్నది. అందుచేత అతను తనకున్న ఒక పారనూ ఒక చోట రహస్యంగా పూడ్చిపెట్టి, బైరాగిగా అడవులలో తపస్సు చేసుకోబోయాడు.

అయితే అతనికి తపస్సుమీద మనసు కుదరలేదు. ఎందుకంటే మాటిమాటికి అతని బుద్ధి పారమీదికే వెళ్లసాగింది. అది ఏమవుతుందోనన్న విచారం తీవ్రంగా బాధించేసరికి అతను తపస్సు మాని, తిరిగివచ్చి పారను తవ్వితీసుకుని తిరిగి కూరలు పండించసాగాడు.

ఇలా అతను ఆరుసార్లు ప్రపంచంమీద విరక్తిచెంది అడవులకు వెళ్లడమూ, పారమీది మమకారంకొద్దీ తిరిగి రావటమూ జరిగింది. ఏడవసారికూడా అతను పారకోసం తపస్సు మాని తిరిగివచ్చాడు.. ఈ పారే తన పరమార్థచింతను పాడుచేస్తున్నదని అతనికి తోచింది. అందుచేత అతను ఆ పారను తీసుకుని గంగవద్దకు వెళ్ళాడు. దానిని రెండు చేతులా పట్టుకుని గిరగిరా తిప్పి నీటిలోకి విసిరివేశాడు. అది ఎక్కడ పడుతుందో కనబడకుండా ఉండగలందులకు కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

ఈ విధంగా పార బెడద వదిలిపోయింది. అతను పరమానందంతో ఎలుగెత్తి, "గెలిచాను! గెలిచాను!" అంటూ కేకలుపెట్టసాగాడు.

సరిగా అదే సమయానికి ఆ పక్కగా కాశీదేశపు రాజు, యుద్ధంలో గెలిచి తన సైన్యాలతో సహా తిరిగివస్తున్నాడు. పేదవాడు "గెలిచాను!" అని కేకలుపెట్టటం ఆయనకు వినపడింది. ఆయన అతణ్ణి పిలిపించి, "నేనుకూడా శత్రువులను గెలిచే వస్తున్నాను. కాని నీవు పొందే ఆనందం నేను పొందటంలేదు. నీ గెలుపులో విశేషం ఏమిటి?" అని అడిగాడు.

పేదవాడు తాను సాధించిన విజయంగురించి చెప్పాడు. రాజు కొంచెం ఆలోచించి, "నీ విజయమే గొప్పది. ఇప్పుడు నువ్వెక్కడికి పోతున్నావు?" అని అడిగాడు.

"హిమాలయాలకు," అని పేదవాడు జవాబిచ్చాడు.

"పద, నేనూ వస్తున్నాను!" అంటూ రాజు, తన రాజ్యాన్నీ ఐశ్వర్యాన్నీ త్యజించి, ఆ పేదవాడివెంట బయలుదేరాడు.







# మిత్రప్రేమ

గంగాతీరాన ఒక గ్రామంలో జయప్రతాపులని ఇద్దరు క్షత్రియ కుమారులుండేవారు. వారు పసితనంనుంచీకూడా అత్యంత స్నేహితులు. వారు యుక్తవయస్సు వచ్చేవరకు విద్యాభ్యాసం చేసి, ఏ రాజులవద్దనైనా కొలువుచేసుకోవటానికి చెరొకవేపూ వెళ్లారు.

వారిలో జయుడు అమరావతీ నగరంలో విదర్భదేశపు రాజువద్ద కొలువు సంపాదించి, తన శౌర్యవిశ్వాసాలచేత తన ప్రభువును మెప్పించి పైకివచ్చాడు. అదేవిధంగా ప్రతాపుడు ఉజ్జయినీ నగరంలో మాళ్వ దేశపు రాజువద్ద కొలువులో ప్రవేశించి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకున్నాడు.

పన్నెండేళ్లపాటు బాల్యమిత్రులు ఒకరినొకరు చూసుకోకుండానే కాలం జరిగిపోయింది. కాని వారు ఒక్కనాడుకూడా ఒకరి నొకరు మరవలేదు. అమరావతి నుంచి ఎవరైనా ఉజ్జయినికి పోతుంటే వారివెంట జయుడు తన మిత్రుడికి అపూర్వమైన వస్తువులు కానుకగా పంపేవాడు. అదేవిధంగా ఉజ్జయినినుంచి అమరావతి వెళ్ళేవారివెంట ప్రతాపుడు జయుడికి కానుకలు పంపుతూండేవాడు.

కొంతకాలానికి జయుడికి తన బాల్యమిత్రుణ్ణి కళ్ళారా చూడాలని తీవ్రమైన కోరిక కలిగింది. అతను రాజుగారివద్ద సెలవుతీసుకుని బయలుదేరి అమరావతి నుంచి ఉజ్జయినికి వెళ్ళాడు. ప్రతాపుడి ఆనందానికి మేరలేదు. అతను జయుడికి సమస్తమైన సౌఖ్యాలూ అమర్చాడు. కాని ప్రతాపుడి సత్కారాలన్నీ బూడిదలో పోసిన పన్నీరుగా మారినట్టు కనబడ్డాయి.

ఆరోజు కారోజు గడుస్తున్నకొద్దీ జయుడు తిండితినటమూ, నిద్రపోవటమూ మానేసి, చిక్కి నీరసించసాగాడు. దీనికి కారణమేమంటే, ప్రతాపుడి ఇంట జయుడికి

ఆర్. వెంకటశాస్త్రి



ఒక చక్కని ఆడపిల్ల కనిపించింది. ఆమెను చూసినదిమొదలు అతనికి ఆపిల్ల ధ్యాస తప్ప మరొకటిలేకుండా పోయింది.

"ఏమిటిది, జయా? ఎందుకిట్లా చిక్కి పోతున్నావు? ని ఒంట్లొ సరిగాలేదా? వైద్యుణ్ణి పిలిపించనా?" అని ప్రతాపుడు తన మిత్రుణ్ణి ఆత్రంగా అడిగాడు.

"నీకన్న నాకు ఆప్తులెవరున్నారు? నిజం చెప్పేస్తాను. మీ ఇంట ఒక అందగత్తెను చూశాను. ఆమెను పెళ్లాడనిపక్షంలో నేను చచ్చి తీరుతాను," అన్నాడు జయుడు.

"అ పిల్లపేరు మనొరమ. ఆమెకు తలి దండ్రులు లెరు. కాని చాలా ఆస్తిగలది. మాయింటనే పెరుగుతున్నది. నేను పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నాను. అయితే నువు ఆమెను ఇంతగా ప్రేమిస్తున్నావు గనక, నువె చెసుకొ," అంటూ ప్రతాపుడు జయుణ్ణి బలవంతాన ఒప్పించి, మనొరమ నిచ్చి పెళ్ళి చెసెశాడు. మరికొద్ది రోజులకు జయుడు మనొరమతొ సహా ఉజ్జయిని నుంచి అమరావతికి తిరిగివెళ్ళాడు.

కొద్దికాలం గడిచింది. ఉజ్జయినీరాజు చనిపోయి యువరాజు సింహాసనం ఎక్కాడు. గిట్టనివాళ్లు ప్రతాపుడిమీద చాడీలుచెప్పి అతనిని కొలువులోనుంచి తొలగించారు.



త్వరలోనే ప్రతాపుడు అతి బీదస్థితికి వచ్చాడు. అతనికి ఏమిచెయ్యటానికీ తోచ లేదు. చుట్టుపక్కల అందరూ శత్రువులుగా మారిపోయారు.

ఈస్థితిలో తనకు జయుడు ఒకడే దిక్కనిపించి ప్రతాపుడు కట్టుబట్టలతో అమరావతీ పట్టణానికి బయలుదేరి వెళ్లాడు. అతను నగరం ప్రవేశించేసరికి బాగా చీకటి పడింది. "ఈ చీకట్లో ఈ మాసినబట్టలతో, వికృతాకారంతో, పెరిగిపోయిన గడ్డంతో వెళితే జయుడు నన్ను గుర్తిస్తాడో, గుర్తించడో. ఈ రాత్రికి ఎక్కడైనా తల దాచుకుని, రేపు ఉదయం అతన్ని



చూస్తాను," అనుకుని ప్రతాపుడు ఆ రాత్రి గడపటానికి శ్మశానంవేపు వెళ్ళాడు.

అక్కడ అతను ఒకచోటు చూసుకుని పడుకున్నాడు, కాని నిద్రపట్టలేదు. ఒక రాత్రివేళ అక్కడికి ఇద్దరు మనుషులు వచ్చారు. వారి సంభాషణ చూస్తుండగానే పోట్లాటగా పరిణమించింది. చివరకు ఒకడు బాకుతీసి రెండోవాణ్ణి పొడవబోయాడు. రెండోవాడుకూడా బాకుతీసి మొదటివాణ్ణి పొడిచాడు. బాకుదెబ్బతిన్న వాడు పెద్ద కేకపెట్టి పడిపోయాడు. పొడిచిన వాడు కంగారుపడి పరిగెత్తుకుంటూ ప్రతాపుడు పడుకున్నవేపుగా వెళ్లిపోయాడు.



ఇద్దరు వ్యక్తులు పోట్లాడటమూ, ఒకడు మరొకణ్ణి పొడిచి పారిపోవటమూ మొదలైనవి ప్రతాపుడిలాగే ఆ అపరాత్రివేళ మరి కొందరుకూడా చూశారు. వాళ్లు హంతకుడు పరిగెత్తినదిక్కుగా పరుగునవచ్చి ప్రతాపుణ్ణి చూసి, అతనే హంతకుడనుకుని, అతన్ని పట్టుకుని కొత్వాలువద్దకు తీసుకుపోయారు. కొత్వాలు ప్రతాపుణ్ణి తెల్లవార్లూ ఖైదులో ఉంచి, మర్నాడు భటులవెంట న్యాయస్థానానికి పంపాడు.

ప్రతాపుణ్ణి వీధివెంబడి తీసుకుపోతూండగా, జయుడు చూసి గుర్తించి, "ఏమిటిది? ఇతన్ని ఎక్కడికి తీసుకుపోతున్నారు?" అని భటులను అడిగాడు.

"నిన్న రాత్రి శ్మశానంలో ఈ మనిషి మరొక మనిషిని హత్యచేశాడు. విచారణకు తీసుకుపోతున్నాం," అన్నారు భటులు.

"పిచ్చివాళ్లల్లారా, శ్మశానంలో హత్య చేసినవాణ్ణి నేను, ఇతన్ని విడిచేసి నన్ను పట్టుకుపొండి," అన్నాడు జయుడు.

"ఇతనెవరో నాకు తెలీదు. శ్మశానంలో రాత్రి హత్యచేసింది నేనే, పదండి," అన్నాడు ప్రతాపుడు.

భటులకేమీ పాలుపోక ఇద్దర్నీ పట్టుకుని న్యాయస్థానానికి తీసుకుపోయారు.





న్యాయాధికారి ఇద్దరినీ విచారించికూడా హంతకుడెవరో నిర్ణయించలేకపోయాడు.

"ఈ ఇద్దరిలో ఒకడు హంతకుడు, రెండోవాడు పిచ్చివాడు. ఎవరెవరో నిర్ణయించటం నాతరంకాదు. ఇద్దర్నీ తీసుకుపోయి కొరతవెయ్యండి!" అని ఆయన చివరకు తీర్పు చెప్పాడు.

భటులు జయప్రతాపుల నిద్దరినీ వధ్యస్థానానికి తీసుకుపోయి, అక్కడికి చేరిన కొత్వాలుకి న్యాయాధికారి తీర్పు అందజేశారు. శిక్ష చూడటానికి అమరావతీ పౌరులు చాలా మంది గుమికూడారు. వారిలో అసలు హంతకుడుకూడా ఉన్నాడు. అధికారులు తనను పట్టుకోలేకపోగా ఇద్దరు నిర్దోషులను కొరతవేయిస్తూండటం చూసి హంతకుడికి మండిపోయింది. వాడు కొత్వాలుదగ్గిరికి పోయి, "మీ న్యాయం అఘోరించినట్టే ఉంది! అసలు హంతకుణ్ణి నేను. వీళ్లిద్దరినీ విడిచిపుచ్చి నన్ను కొరతవేయించండి!" అన్నాడు.

విచారణ చెయ్యనివాణ్ణి శిక్షించటానికి కొత్వాలుకు అధికారంలేదు. ముద్దాయీల సంఖ్య రెండునుంచి మూడుకు పెరిగింది. కొత్వాలు ముగ్గురినీ వెంటబెట్టుకుని న్యాయస్థానానికి వెళ్ళాడు.



"ఈ హత్యానేరం విచారణ చేసి శిక్ష విధించానే?" అన్నాడు న్యాయాధికారి.

"ఇప్పుడు మరొక హంతకుడు దొరికాడు. తమరు ముగ్గురినీ కలిపి విచారించండి," అన్నాడు కొత్వాలు.

ఈసారి విచారణలో జయప్రతాపులు తాము హంతకులు కానట్టు ఒప్పుకున్నారు.

"నువు హంతకుడవు కానప్పుడు ఔనని ఎందుకన్నావు?" అని న్యాయాధికారి జయుణ్ణి అడిగాడు.

"అయ్యా, ఈ ప్రతాపుడు నా ప్రాణస్నేహితుడు. నాకోసం తన సర్వస్వమూ ధారపోసినవాడు. అతన్ని భటులు హత్యా

నేరంపైన పట్టుకుని తీసుకుపోతుంటే, అతను నిజంగా హంతకుడే అనుకుని అతన్ని తప్పించటానికి ఆ నేరం నాపైన వేసుకున్నాను," అన్నాడు జయుడు.

"నీమాటేమిటి?" అని న్యాయాధికారి ప్రతాపుణ్ణి అడిగాడు.

"నామిత్రుడు తానే హంతకుణ్ణని అనే సరికి నమ్మి, అతన్ని తప్పించటానికి హత్యా నేరం నాపైన వేసుకున్నాను. అంతకంటె ఏమీలేదు," అన్నాడు ప్రతాపుడు.

న్యాయాధికారి అసలు హంతకుడివైపు తిరిగి, "నీమాటేమిటి? వాళ్ళిద్దరినీ కొరత వేయబోయేదాకా నిజం చెప్పనివాడివి, అప్పుడెందుకు చెప్పావు?" అని అడిగాడు.

"అయ్యా, నాచేత చచ్చినవాడు పాపి, ద్రోహి. అయినా వాణ్ణి ఆత్మరక్షణార్థమై మాత్రమే చంపవలసివచ్చింది. వాణ్ణి చంపి నందుకు న్యాయంగా మీరు నన్ను సన్మా నించవచ్చు. కాని అలాచేయరు. కొరత వేస్తారు. అందుకని నేను బయటపడలేదు. కాని నాకు బదులుగా ఇద్దరు మనుషులు, ఏపాపమూ ఎరగనివారు కొరతపడితే, నేను నరకానికి పోనా? అందుచేత నా నేరం బయటపెట్టాను. నేను బయటపడటానికి కారణం కొత్వాలు గారి సమర్థత కాదు, అసమర్థత," అన్నాడు.

న్యాయాధికారి దూరం ఆలోచించి ముగ్గురినీ విడిచిపుచ్చుతూ, "నీవు హత్య చేసినప్పటికీ చాలా యోగ్యుడివిగా కనబడ తావు. నిన్ను వదిలేసినందువల్ల ఇంకా హత్యలు జరగవనీ, నీకు మనుషుల ప్రాణాలపట్ల గౌరవం ఉన్నదనీ గుర్తించి నిన్ను విడిచిపుచ్చుతున్నాను," అన్నాడు.

తరవాత ప్రతాపుడు జయుడిదగ్గిరే ఉండి, అతనిద్వారా రాజుగారి కొలువులో నౌకరీ సంపాదించాడు. అప్పటినుండీ మిత్రు లిద్దరూ ఒకరినొకరు జీవితాంతందాకా ఎడ బాయక, సుఖంగా జీవించారు.





బుద్ధ భగవానుడు



# గౌతమ బుద్ధుని జీవితం

శుద్ధోదనుడు కపిలవస్తు నగరాన్ని పాలించే శాక్యరాజు. ఆయన భార్య మాయాదేవి. ఒకనాటి రాత్రి ఆమె, ఒక తెల్లని ఏనుగు ఆకాశంనుంచి వెలిగిపోతూ దిగివచ్చి, తన గర్భంలో ప్రవేశించినట్టు కల గన్నది. స్వప్నఫలాలను చెప్పేవారి నడిగితే, ఆమె గర్భవాసాన ప్రపంచాన్ని ఉద్ధరించగల మహనీయుడు జన్మిస్తాడన్నారు.

తొమ్మిది మాసాల అనంతరం మాయాదేవి, రాజభవనం ఆవరణలోని మద్దిచెట్టు కింద, మధ్యాన్నం వేళ, ప్రసవవేదన ఏమీ లేకుండా ఒక మగశిశువును కన్నది.

రాజకుమారుణ్ణి చూడటానికి అనేకమంది వచ్చారు. వారిలో అసితుడనే మునికూడా ఉన్నాడు. ఆయన పసిపాపణ్ణి ఆశీర్వదించటానికి బదులు, అతనిముందు సాష్టాంగపడి, "నాయనా, నువు మానవులను ఉద్ధరించటానికి అవతరించిన బుద్ధుడవు!" అంటూ నమస్కరించాడు.

కుర్రవాడు కలిగిన ఏడవరోజు మాయాదేవి తనువు చాలించింది. బిడ్డను దాదులు పెంచారు. అతనికి సిద్ధార్థుడని పేరు పెట్టుకున్నారు. ఎనిమిదవ ఏడు రాగానే అతన్ని విశ్వామిత్రుడనే గురువువద్ద చదవవేశారు. కాని ఆ బాలుడికి తెలియవలసిన విషయాలన్నీ అదివరకేతెలుసు. అతనికిఅప్పటికింకా బాధా, ఖేదమూ అనుభవంలోకి రానప్పటికీ, వాటిని అర్థం చేసుకున్నవాడులాగా కనిపించేవాడు; నోరులేని జంతువులపట్ల ఎంతో దయాదాక్షిణ్యాలతో ప్రవర్తించేవాడు.

ఒకనాడు రాజభవనంమీదుగా హంసల గుంపొకటి ఎగురుతూ వచ్చింది. సిద్ధార్థుడి పినతండ్రి కుమారుడు దేవదత్తుడు బాణంతో ఒక హంసను పడగొట్టాడు. రెక్కలో బాణం గుచ్చుకున్న ఆ హంసను సిద్ధార్థుడు ప్రేమతో ఎత్తి, బాణం లాగేసి, హంసను నిమురుతూ భయం పోగొట్టాడు. దేవదత్తుడు ఆ హంస తనదన్నాడు. ప్రాణులు ప్రాణం రక్షించినవారికి చెందుతాయిగాని, చంపయత్నించినవారికి చెందవని వాదించి, సిద్ధార్థుడు హంసను ఇవ్వ నిరాకరించాడు. గాయం నయమయాక అతను హంసను స్వేచ్ఛగా వదిలేశాడు.

యువరాజుకు పద్దెనిమిదేళ్ళు నిండాయి. కాని అతని భవిష్యత్తుగురించి రాజుకు ఆందోళనగా ఉన్నది. ఎందుకంటే, దైవజ్ఞులు అతన్నిగురించి చెబుతూ, అతను రాజాధిరాజైనా అవుతాడు, సర్వ సంగ పరిత్యాగి అయినా అవుతాడని చెప్పి ఉన్నారు. తన కుమారుణ్ణి సౌఖ్యబంధాలలో ఉంచటం మంచిదని రాజుకు తోచింది. మిగిలిన బంధాలకన్న ప్రేమబంధం దృఢమైనదనీ,



అతనికి నచ్చిన కన్యను చూసి పెళ్ళిచేయటం యుక్తమనీ పెద్దమంత్రి సలహా ఇచ్చాడు.

ఇందుకుగాను రాజు ఒక ఉత్సవం ఏర్పాటుచేశాడు; అందులో యువరాజు చేత కపిలవస్తు మహానగరంలోని కన్య లందరికీ బహుమానా లిప్పించారు. నగరం లోని అందగత్తెలందరూ ఒకరి తరవాత ఒకరు సిద్ధార్థుడి ముందుకు వచ్చి బహు మానాలు స్వీకరించి వెళ్ళారు. ఆఖరుకు వచ్చిన కన్య యశోధర, అందరికన్న అంద గత్తె. కాని దురదృష్టవశాత్తూ బహుమానా లన్నీ అయిపోయాయి. సిద్ధార్థుడు వెంటనే తన మెడలోని పచ్చలహారం తీసి, ఆమె నడుముకు చుట్టాడు. వారిద్దరూ ఒకరి నొకరు చూసుకునే సమయంలో సిద్ధార్థుడికి యశోధరపై ప్రేమ జనించింది.

అయితే వారిరువురి వివాహాని కొక చిన్న అంతరాయం ఉన్నది. ఆమెను పెళ్ళాడ గోరిన యువకులింకా అనేకమంది ఉన్నారు. బలపరాక్రమాలలో వారందరినీ ఓడించిగాని సిద్ధార్థు డామెను పెళ్ళాడ లేడు. వారిలో దేవదత్తుడు విలువిద్యా కుశలుడు, అర్జునుడు గుర్రపు స్వారిలో నిపుణుడు, నందుడు కత్తిపట్టటంలో ప్రసిద్ధుడు. ఈ విద్యలలో ఒక్కటికూడా తాను నేర్చిఉండనప్పటికీ సిద్ధార్థుడు వీరి నందరినీ ఓడించి యశోధరను పెళ్లాడాడు.

ఇప్పుడతని జీవితం ప్రేమమయం, శృంగారమయం, సుఖమయం. ఇతరులెలా జీవించేదీ అతనికి తెలీదు. ఈస్థితిలో ఒకనా డతనికి నగరం చూడాలని కోరిక కలిగింది. దారిలో అతనికి బాధ కలిగించే దృశ్యాలేవీ కనిపించకుండా రాజు ఎన్నో కట్టుదిట్టాలు చేశాడు. అయినప్పటికీ అతను ఆరోజు, ముష్టిఎత్తుకునే ఎనభైఏళ్ల వృద్ధు నొకణ్ణి చూడటం తటస్థించింది. ఆ ముసలివాడి చర్మం ముడతలు పడి ఉన్నది, అతని దంతాలన్నీ ఊడిపోయాయి. అతని శరీరం వణుకుతున్నది. చావు అడ్డుతగలకుండా ఉండేపక్షంలో అందరూ ఇలాగే ముసలి వాళ్ళవుతారని సిద్ధార్థుడితో రథంతోలే చెన్నుడు చెప్పాడు.

ఇలాగే మరొకసారి నగరంలోకి వెళ్ళి నప్పుడు వాస్తవజీవితాన్ని కళ్లారా చూశాడు. అతను చూసినవారిలో పేదలూ, అస్పృ శ్యులూ, వ్యాధిగ్రస్తులూ ఉన్నారు. నికృష్ట మైన జీవితం, అనేక భయాలలో చిక్కి అవసానం—చావు—కోసం ఎదురుచూసే మనుషులు కళ్ళఎదట ప్రత్యక్షంగా కనిపిం చారు. అతని కొక శవమూ దాని వెంట ఏడుస్తూ నడిచే మనుషులూ కనిపించారు. ఇదంతా చూసి అతనిలో ఏదో ఆవేదన కలిగింది. బ్రతుకు భయం, ఆనందం భ్రమ! దీని అంతర్యం అతనికి బోధపడలేదు.

అవగాహన కాని ఈ సత్యాన్వేషణకై అతను ఒక రాత్రి వెళ్లిపోయాడు. భార్య యశోధర, కుమారుడు రాహులుడు గాఢ నిద్రలో ఉన్నారు. సిద్ధార్థుడు భార్యపాదాలు



అంటుకుని, ఆమె మంచంచుట్టూ మూడు సార్లు ప్రదక్షిణం చేసి, బయటికి వెళ్ళాడు. చెన్నుణ్ణి పిలిచి తన గుర్రం సిద్ధంచెయ్య మన్నాడు. మత్తువచ్చినట్టుగా ఒక్కరైనా మేలుకోలేదు. సింహద్వారాలు వాటంతట అవే నిశ్శబ్దంగా తెరుచుకున్నాయి.

తెల్లవార్లూ గుర్రంమీద ప్రయాణంచేసి తెల్లవారుజామున సిద్ధార్థుడు గుర్రందిగాడు. తన రాజదుస్తులూ, ఆభరణాలూ, కత్తీ తీసి వేశాడు. కత్తితో తన జుట్టు తెగగోసేశాడు. తన వస్తువులన్నీ చెన్నుడికిచ్చి, పంపేశాడు.

బింబిసారుడనే రాజు పరిపాలించే రాజ గృహమనే నగరపు పరిసరాలలో భావి బుద్ధుడు ఉపవాసాలూ, తపశ్చర్యా సాగించాడు. అక్కడి ఋషులతో చర్చించాడు. కాని జ్ఞానోదయం కలగలేదు. ఒకనాడాయనకొక పశువుల మంద కనిపించింది. అందులోని గొర్రెలూ, మేకలూ యజ్ఞంలో బలికావటానికి పోతున్నాయి. వాటిలో ఒక పిల్ల కుంటుతున్నది. దాని తల్లి దానికోసం ఆత్రంగా తిరిగితిరిగి చూస్తూ పోతున్నది. ఆ పిల్లను భుజాన ఎత్తుకుని బుద్ధుడు యజ్ఞం జరిగేచోటికి వెళ్ళాడు. యజ్ఞబలులు నిలపవలిసిందని రాజును హెచ్చరించాడు. "అందరూ ప్రాణం తీయగలరు, ఒక్కరూ ప్రాణం ఇవ్వలేరు. దయవల్ల ప్రపంచం సౌఖ్యవంతమూ, ఉదారవంతమూ అవుతుంది," అని ఆయన చెప్పకుపోతూంటే అందరి హృదయాలూ పరివర్తన చెందాయి.

మానవులకు విమోచనమార్గం చూపే జ్ఞానంకోసరం బుద్ధ భగవానుడు ఏడేళ్ళపాటు కృషి చేశాడు. చివరకా జ్ఞానం ఆయనకు గయ సమీపాన బోధివృక్షంకింద లభించింది. దుఃఖం, తృష్ణ, కర్మ అనే వాటియొక్క స్వభావాన్ని ఆయన అవగాహన చేసుకుని, శాంతిమార్గాన్నీ, నిర్వాణాన్నీ భావన చెయ్యగలిగాడు.

ఏడు సంవత్సరాల అనంతరం బుద్ధుడు తిరిగి కపిలవస్తు నగరానికి చేరుకున్నాడు. ఈసారి ఆయన యువరాజు కాడు; కాషాయ వస్త్రాలూ, చేత భిక్షాపాత్రా ధరించిన విరాగి. యశోధర, తన ఏడేళ్ల కుమారుడు రాహులుడితో సహా, తన భర్తకోసం ఆత్రంగా ఎదురుచూడసాగింది. కాని రాజుమటుకు, తన కుమారుడు బిచ్చగాళ్లతో చేరిపోయాడని ఆగ్రహం చెందాడు.

కాని ఈ బుద్ధుడు మామూలు బిచ్చగాడెన్నటికీ కాడు. ఆయన రారాజు. ఆయన జ్ఞానోపదేశం వినటానికి జనం తండోపతండాలుగా వచ్చారు. శుద్ధోదన మహారాజూ, యశోధరా, రాహులుడూ, మిగిలిన అందరూకూడా ఆయన ఉపదేశాలు విని ఆయన మతం అవలంబించారు.

బుద్ధభగవానుడి సందేశం ఆదేశంనుండి ఆ దేశానికి పాకింది. దాని ఫలితంగా ప్రజలలో దైవత్వం పెరిగి, వారు నీతిగా జీవించటమూ, ప్రాణులయందు కారుణ్యం వహించటమూ ఆరంభించారు.




# 12

[కోయకులపెద్దలు పంపిన దూతను నరవాహనుడు అవమానించి పంపగానే, వాళ్లు యుద్ధ సన్నాహాలు ప్రారంభించారు. అక్కడ ఒక కొండమీద వున్న శిథిలదుర్గం ఆక్రమించుకుని, ఆ ప్రదేశాన్నుంచి యుద్ధం నడపాలని వాళ్ల ప్రయత్నం. నరవాహనుడు తన సైనికబలాన్ని దుర్గం ముట్టడించేందుకు పంపాడు. భయంకర యుద్ధం ప్రారంభమైంది. తరవాత—]

"కొండదిగువ ప్రారంభమైన సైనికుల కోలాహలం, ఏనుగుల ఘీంకారాలూ విన్న ఇద్దరు కోయయువకులు శిథిలదుర్గ ప్రాకారాలమీద నిలబడి దిగువకు చూస్తూ, 'శత్రువులు తోడేలుగూడెం ప్రాంతాల వరకూ వచ్చారు. వాళ్లు ఎక్కవున్న ఏనుగులమీదకు మనవాళ్లు, సింహాలను వదిలారు!' అంటూ అమితోత్సాహంతో చప్పట్లు చరిచారు. నేను పరుగుపరుగున ఆ కోయ యువకులు వున్న చోటుచేరాను," అంటూ చెప్పుకుపోతున్నాడు శివదత్తుడు.

విజయ గర్వంతో కన్నుమిన్ను కానకుండా ముందుకు వస్తున్న నరవాహనుడి గజసైనికులూ, వారి వెనుకనే నడుస్తున్న పదాతిసైనికులూ మాకు కనిపించారు. దాదాపు తోడేలుగూడెం ప్రాంతంలో వారి మీదకు కోయయువకులచేత చెట్లచాటు నుంచి హఠాత్తుగా సింహాలు వదలబడినై. భీకరంగా గర్జిస్తూ ముందుకు వురికే సింహాలను చూచి ఏనుగులు వెనుదిరిగి చెల్లాచెదరు కాసాగినై. ఇక, వాటి కాళ్లకింద పడకుండా, మీదిమీదికి వస్తున్న సింహాల నోళ్ల

పడకుండా, నరవాహనుడి సైనికులు అన్ని వైపులకూ పారిపోతున్నారు.

"చాలా మంచిపని చేశారు!" అన్నాను నా పక్కన వున్న కోయ యువకులతో. "అయితే, ఆ సింహాలను తిరిగీ మీవాళ్లు పట్టుకుని, మరోమారు శత్రువులమీదికి వదలగలరా?" అని అడిగాను.

"అన్ని సింహాలనూ తిరిగిపట్టుకోవటం సాధ్యమయే పనికాదు. కొన్ని అడవిలోకి పారిపోవచ్చు," అన్నారు వాళ్లు.

ఆ సరికి నాకు యీ రకమైన పోరాటంలో వున్న నమ్మకం కాస్తా పోయింది. ఆయుధాలతో సర్వసన్నద్ధులై వున్న సైనికులపైకి యీరకంగా సింహాలనూ, పులులనూ వదిలితే, ఒకసారికి వాళ్లు భయపడి పారిపోవచ్చు. కాని, రెండవసారి తగు జాగ్రత్తలో వచ్చి వాటిని హతమార్చగలరు!

ఆ రోజు ప్రొద్దు గూకేవరకూ ఆ అడవి ప్రాంతాల యిలాంటివే మరికొన్ని విచిత్ర దృశ్యాలు చూచాను. ఒకచోట నరవాహన సైనికులు గుంపుగా కూర్చుని భోజనాలు ప్రారంభించబోతున్నారు. హఠాత్తుగా వారి మధ్యకు చెట్లమీదినించి ఒక పెద్దగంప విసరబడింది. మరుక్షణం అందులోనుంచి వేలాది విషసర్పాలు బుసలుకొడుతూ బయటికి దూకినై. నరవాహనుడి సైనికులు



ఎక్కడివారక్కడే తమ ఆయుధాలను వదిలి పారిపోయారు. సర్పాలు తమ దారిన పుట్టల్లోకీ, చెట్లమీదికీ వెళ్లిపోయినై.

ఈ రకమైన యుద్ధతంత్రంతో నరవాహ నుణ్ణి జయించటం సాధ్యమయేది కాదని, ఆ రాత్రి కోయవృద్ధుడితో చెప్పాను. ఒక సారికన్న ఎక్కువసారు వుపయోగిం చేందుకు వీలులేని ఆయుధాలవల్ల కలిగే ఫలితం ఏమీ వుండదన్న నా అభిప్రాయంతో అతడూ ఏకీభవించాడు.

ఆరాత్రి చాలాసేపు యోచించిన మీదట నేనొక నిర్ణయానికి వచ్చాను. కోయ వృద్ధుడికి సాధ్యమైనంత వివరంగా సంగతి సందర్భాలన్నీ చెప్పాను. శత్రుసైన్యంలో ఎక్కువ భాగాన్ని, ఈ దుర్గప్రాంతానికి ఆకర్షించి, నాశనంచేయాలి. శిథిలమైవున్నా, యీ దుర్గం ఎవరి చేతుల్లో వుంటే వారు, నాలుగైదింతలున్న శత్రువునైనా ఎదుర్కొని నాశనం చెయ్యవొచ్చు.

ఇక, శత్రువును నాశనంచేసే బాధ్యత నామీద పడింది. నేను అక్కడ చేరిన ఏడెని మిదిమంది కోయకులపెద్దలకు పరిస్థితి వివరించి చెప్పాను. శత్రువు బలవంతుడు, అతడికి సుశిక్షితమైన సైన్యం వుంది! కొండ మీద వున్న శిథిలదుర్గాన్ని ముట్టడించేందుకు అతడికి అశ్వికబలం, గజారూఢులై యుద్ధం






చేసే సైనికులూ నిరుపయోగం. కనుక, శత్రువు ముఖ్యంగా పదాతిదళాన్నే వుపయోగించాలి. అలాంటప్పుడు శిథిలదుర్గాని కున్న మార్గాలనన్నిటినీ బిగించి, పైకి వచ్చే శత్రువులమీదికి రాళ్లను దొర్లించవచ్చు. అక్కడ వున్న చెట్లపైనుంచి బాణాలను ప్రయోగించవచ్చు. ఇంతచేసినా శత్రువు శిథిలదుర్గాన్ని చేరగలిగితే—ఆపైన చేయగలిగిందేమీ లేదు.

ఇప్పుడు నే చేయవలసిన పనిని దుర్గ రక్షణ అనేకంటే, దుర్గప్రాంతాల రక్షణ అంటేనే బావుంటుంది. ఈ శిథిలమైన దుర్గంలో రక్షించేందుకు ఏమీలేదు. కాని



దుర్గాన్ని రక్షణగా వుపయోగించుకుంటున్నామని శత్రువును మోసగించి, అతణ్ణి కొండదారులు పట్టించి సర్వనాశనంచేయాలి.

బాణాలు వదలటంలో మంచి గురీ, నేర్పూ వున్న కోయయువకుల్ని ఏరి దుర్గం చుట్టూ వున్న చెట్లమీద కాపుపెట్టాను. మంచి దేహబలం వున్న కోయలను పెద్ద పెద్ద బండరాళ్ల వెనక నిలిపి, అవసరం అయినప్పుడు శత్రువులమీద వాటిని తోయవలసిందిగా ఆజ్ఞాపించాను.

సరిగా సూర్యుడు పడమటి దిక్కుకు ఒరిగే సమయానికి నా రక్షణ కార్యక్రమమంతా పూర్తయింది. ఆ సరికి దేహబలం వున్న కోయలంతా తమ తమ ఆయుధాలతో శిథిలదుర్గప్రాంతాన్ని చేరటం, వాళ్లను తరుముకుంటూ నరవాహనుడి సైనికులుకూడా దిగువకు చేరటం జరిగింది.

శత్రువులు క్రమశిక్షణతో ఒక నాయకత్వంకింద ఒకచోట గుమిగూడకముందే, నేను రహస్యంగా చెట్లపై వుంచిన కోయ భటులు వాళ్లమీదకు బాణాలు కురిపించసాగారు. మనుషులు కనపడకుండా, హఠాత్తుగా బాణంవచ్చి తాకటంతో ప్రాణాలు కోల్పోతూ నరవాహనుడి సైనికులు కంగారుపడసాగారు. కొందరు ఆ కంగారులో గురి





చూడకుండానే తమ బాణాలను, ఆ చుట్టు పక్కల వున్న చెట్లమీదకు వదిలారు.

అదే సమయంలో మరికొందరు నరవాహనుడి సైనికులు కత్తులు చేతబట్టి కొండ ఎక్కడం ప్రారంభించారు. అలాంటి శత్రు సైనికులమీదికి, నేను నియమించిన కోయ భటులు పెద్దపెద్ద బండరాళ్లను దొర్లించసాగారు. ఇరుకుదారులలో పక్కలకు పారిపోయేందుకు అవకాశం లేక అనేకమంది శత్రుసైనికులు యీ బండరాళ్లకింద పడి అరుస్తూ ప్రాణాలు వదిలారు.



ఈ విధంగా పోరాటం మహాభయంకరంగా నాలుగైదు గంటలకాలం సాగింది. ఈ లోపల నరవాహనుడి సైనికులలో అధిక సంఖ్యాకులు కొండను ఎగబాకి శిథిలదుర్గ ప్రాంతాలను చేరుకున్నారు. కొండ దిగువ చెట్లమీద వున్న కోయభటులను రక్షించి పైకి తీసుకువచ్చే అవకాశం లేదని నేను గ్రహించాను. చెట్లకొమ్మలలో వుండి విషపూరితమైన అంబులను వదిలేవారిని తుదముట్టించేందుకు నరవాహన సైనికనాయకులు ఒక కొత్తపద్ధతిని అవలంబించారు.

గజారూఢులైవున్న సైనికులు ఆ చెట్ల కిందకు రావించ బడ్డారు. మావటీవాడి సంజ్ఞ కాగానే ఏనుగులు తమ తొండాలతో చెట్లకొమ్మలను పట్టి విరవసాగినై. ఫెళఫెళారావాలతో విరిగిపడుతున్న కొమ్మలతో పాటు అందులో దాగివున్న కోయభటులు కూడా కింద పడసాగారు. అలా కింద పడుతున్నవారిని శత్రుసైనికులు తమ కత్తులతో, యీటెలతో పొడిచి హతమారుస్తున్నారు.

ఇలా కొంతసేపు జరిగేసరికి కోయభటులందరూ, నరవాహనసైనికుల చేతులలో చంపబడటమో, గాయపడటమో జరిగిపోయింది. తమను వెనుకనుంచి ఎదిరించే శత్రువులు ఎవరూ లేరన్న ధైర్యం చిక్కగానే, నరవాహనసైనికులు గుంపులు గుంపులుగా చేరి తమతమ వాహనాలతో

కూడా మిట్టపల్లాలుగా వున్న కొండను ఎక్కేందుకు ప్రయత్నించారు.

గుర్రాలనూ, ఏనుగులనూ కొండ ఎక్కిం చేందుకు ప్రయత్నించే ఆ శత్రు నాయకుల బుద్ధిహీనత నన్ను చాలా ఆశ్చర్యపరిచింది. మావటీవాని శూలంపోటు కుంభస్థలం మీద తగిలేసరికి చేసేది లేక కొన్ని ఏను గులు కొండరాళ్లను ఎక్కేందుకు ప్రయ త్నించినై. పట్టుబలవంతాన ఆ విధంగా కొంతదూరం కొండ ఎక్కి, అక్కడ కాలి కిందవున్న ఏ పెద్దబండరాయో జారటంతో-అక్కడినుంచి ఘీంకరిస్తూ అవి కిందకు దొర్ల సాగినై. ఇక గుర్రాల అవస్థకూడా అంతే!

నేను నా అనుచరులతో; చావగా మిగి లిన కోయభటులతో శిథిల దుర్గంకేసి తిరోగ మించాను. దుర్గద్వారం దగ్గిర కోయ వృద్ధుడు నన్ను కలుసు కున్నాడు.

"శివదత్తా, మేము జయించే అవకాశం లేదనుకుంటాను" అన్నాడు వృద్ధుడు. అతడి కంఠస్వరంలో విచారంగాని, భయచిహ్నాలు గాని నాకు పొడగట్టలేదు. "ఒకవేళ అదే జరిగితే, ప్రతిఘటించకుండా కేవలం పశువుల్లా మేము ఆ నరవాహనుడికి లొంగి పోలేదన్న తృప్తి నాకు మిగులుతుంది! అదే చాలు. ఈ శిథిలదుర్గంలో మా అంతిమ పోరాటం జరుగుతుంది. మీరు మీ అను



చరులతో ఏదైనా సురక్షిత ప్రదేశానికి వెళ్ల వలసిందని కోరుతున్నాను."

కోయవృద్ధుడు యిలా చెప్పేంతలో ఆ దుర్గప్రాంతమంతా నరవాహన సైనికుల కేకలతో మార్మోగిపోయింది. అన్నిటికీ తెగించిన కోయభటులు, శిథిలమైన దుర్గ ప్రాకారాలనుంచి నరవాహన సైనికులను ఎదుర్కొన్నారు. కోయవృద్ధుడుకూడా అంత వరకూ అధికార చిహ్నంగా తనవద్ద వున్న దండాన్ని అవతల పారవేసి, కత్తి చేబట్టి శత్రువులమీదికి వురికాడు.

ఇక అప్పుడు జరిగిన బాహాబాహి యుద్ధం వర్ణనాతీతం. ప్రాణాలపై ఆశలు వదలుకొన్న కోయభటులు, సుశిక్షితులైన నరవాహనసైనికులను రెల్లుదుబ్బులను నరికినట్టు నరకసాగారు. కాని, సంఖ్యలో పదింతలున్న శత్రుసైనికులు క్రమక్రమంగా కోయభటులను వెనకకు నెట్టుతూ శిథిల దుర్గం ప్రవేశించారు.

నేను నా అనుచరులతో, వెనుకకు తగ్గుతూ దుర్గప్రాకారాలు దాటి బయట పడ్డాను. కోయవృద్ధుడు తుదిసారిగా అన్న మాటలు నాచెవుల్లో మార్మోగుతూనేవున్నవి. బహుశా యీసరికి అతడు పోరాటంలో మరణించేవుంటాడు! నేను వెనుదిరిగి దుర్గంకేసి చూశాను. ఒక విరిగిపోయిన గోడమీద





బక్కచిక్కిన అతడి రూపం నా కంట బడింది. కత్తి ఝళిపిస్తూ, అతడు తన అనుచరులను ప్రోత్సహించి, గోడపక్కనే వున్న పాతికమంది నరవాహనసైనికుల మధ్యకు అరుస్తూ దూకేశాడు. ఆ కోయ వృద్ధుడి పట్టుదలా, ధైర్యసాహసాలూ నా నేత్రాలను చెమ్మగిల్ల చేసినై.

నేను నా అనుచరులతో కొండ దిగి వేవేగంగా సముద్రంకేసి బయలుదేరాను. ఇక ఆ ద్వీపంలో వుండటం ఏ మాత్రం క్షేమకరం కావని నిర్ణయించుకున్నాను. అదృష్టదేవత నన్ను పూర్తిగా మరవలేదన్న సూచనగా, సముద్రతీరాన రెండు పడవలు కనిపించినై. నా అనుచరులతో ఆ పడవలెక్కి తెడ్ల సహాయంతో మహాసముద్రం మధ్యకు బయలుదేరాను. ఎటు పోవాలి? ఎక్కడికి పోవాలి? అన్న ఆలోచనే నాకు కలగలేదు. దారిలో మీరు తటస్థపడ్డారు! మందరదేవా, యిదీ నా కథ!" అన్నాడు శివదత్తుడు.

"సమరసేనుడి చరిత్రా, మీ చరిత్రా— రెండూ రెండు అద్భుతాలు!" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు మారు మాటాడకుండా చిరునవ్వు నవ్వాడు. అంతలో పడవలలో వున్న ఒక సైనికుడు, లేచి నిలబడి, "చూడండి, అక్కడ ఏదో వెలుగు కనబడుతున్నది!" అంటూ అరిచాడు.

మందరదేవుడు అటుకేసి చూచి, "శివదత్తా, అదేదో ద్వీపంలాగా కనబడుతున్నది. మనం ఈ మహాసముద్రంలో దారీ తెన్నూ లేకుండా పోయేకన్న, ఏదో ఒక ద్వీపం చేరటం మంచిదిగదా?" అన్నాడు.

"అవును, పడవలను ఆ ద్వీపానికేసి పోనిద్దాం. అది మానవవాస యోగ్యమైనదే అయితే ఫరవాలేదు; లేక ఏ భయంకర ద్వీపమో అయితే..." శివదత్తుడు మాట ముగించకుండా నవ్వి వూరుకున్నాడు.

(ఇంకా వుంది)



# కోతిపని

ఒక రాజుగారి తోటలో ఒక కోతిదండు ఉండేది. ఆ దండుకు పెద్దకోతి నాయకుడుగా ఉండేది. ఒకనాడు నగరంలో జాతర జరిగింది. రాజుగారి తోటమాలికి జాతర చూడబోవాలనిపించింది. అతను పెద్దకోతిని పిలిచి, "నేను జాతర చూడబోతున్నాను గాని, ఈ పూటకు మీ కోతులచేత మొక్కలన్నిటికీ నీళ్ళుపోయించు!" అని కోరాడు. పెద్దకోతి సరేనన్నది.

కోతులన్నీ చెంబులు తీసుకుని ఉత్సాహంగా మొక్కలకు నీళ్ళుపొయ్యసాగాయి. వాటి ఉత్సాహం చూసి పెద్దకోతి, "మీరు నీళ్లన్నీ వృథాచేసేస్తున్నారు. ఏచెట్టు కెంత నీరు కావాలో అంతే ఎంచి పొయ్యండి," అన్నది.

"ఎంచడం ఎట్లా?" అని కోతులు అడిగాయి.

"ప్రతిమొక్కనూ పీకి, ఏ మొక్కకు ఎంతపొడుగు వేళ్ళున్నాయో చూడండి. వేరు ఎక్కువ ఉన్నకొద్దీ మొక్కకు నీరెక్కువ కావాలి," అన్నది పెద్దకోతి.

కోతులు ఆ ప్రకారమే చేసి, తోటమాలి తిరిగివచ్చేలోపుగా మొక్కలన్నిటినీ పీకిపెట్టాయి.



# జయాపజయాలు

సాహసోపేతుడైన విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగిపోయి, శవాన్ని దించి భుజాన వేసుకుని, మళ్లీ శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకు గల ఉదారగుణం అందరికీ వుండదు. నీకు నచ్చే కథ ఒకటి చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

తామ్రపర్ణి తీరాన ఒకప్పుడు అనేక చిల్లర రాజులు వెలిసి తమలో తాము ఎడ తెగని యుద్ధాలు చేసుకున్నారు. ఇలాటి ఒక యుద్ధంలో తేజస్వి అనేవాడు గజ నగరాన్ని జయించి, ఆ దేశపు రాజును చంపేసి, తానే రాజైనాడు. గజనగరపు యువరాజు మాధవవర్మ పరారీఅయి, నదినిదాటి వ్యాఘ్రనగరం చేరి, ఆ నగరాన్ని ఏలే శౌర్యవర్మను శరణుజొచ్చాడు.

గజనగరానికి రాజై కూర్చున్న తేజస్వి వ్యాఘ్రనగరాన్నికూడా కబళించటానికి

## బేతాళ కథలు





సన్నాహాలు ఆరంభించాడు. కారణమేమంటే, తనకు శత్రుశేషమైన మాధవవర్మ వ్యాఘ్రనగరంలో ఉన్నాడు. అదీగాక తేజస్వికి పరరాజ్యాలను జయించాలనే కాంక్ష తీరలేదు. అందుకని ఆయన సైన్యాన్ని సమకూర్చుకుని, సామంతులను వెంటబెట్టుకుని, పడవల్లో నదిని దాటి, వ్యాఘ్ర నగరంమీద పడ్డాడు. అయితే, వ్యాఘ్రనగరపు రాజయిన శౌర్యవర్మ దీనికి సిద్ధంగా వున్నవాడు కావటంచేత, తన బలాలను రహస్య స్థానాలలో దాచివుంచి, శత్రువును కోట ప్రవేశించనిచ్చి, చావు దెబ్బ కొట్టాడు. తేజస్వి ఘోరపరాజయం పొంది, సైన్యాన్ని కోల్పోయి, ప్రాణాలతో గజనగరం చేరుకోగలిగాడు.

ఈ యుద్ధంలో తేజస్వికి సహాయపడిన సామంతులలో మతిమంతుడనే యువకుడొకడున్నాడు. వ్యాఘ్రనగరపు కోటను ప్రవేశించినవారిలో ఇతనుకూడా ఒకడు. ఆ సమయంలో ఈ మతిమంతుడు శౌర్యవర్మ కుమార్తెను, లావణ్యవతిని చూశాడు. అదిమొదలు మతిమంతుడికి లావణ్యవతిని ఎలా పెళ్ళాడాలా అన్న ఆలోచన తప్ప మరొక ఆలోచనే లేదు. ఆతను ఒకనాడు తేజస్విదగ్గిరికి వెళ్ళి, "మహారాజా, వ్యాఘ్రనగరంలో మనకు జరిగిన పరాభవం తలుచుకుంటే నాకు నిద్రాహారాలు రుచించకుండా ఉన్నాయి. మనం ఈసారి వ్యాఘ్రనగరంమీద దండెత్తాలంటే ఆ నగరంలో మన మనిషి వేగు జరపాలి. ఎవరినైనా పంపుదామా?" అని సూచించాడు.

"దానికి ఎవరు సిద్ధపడతారు?" అని అడిగాడు తేజస్వి.

"నేను సిద్ధంగా ఉన్నాను," అన్నాడు మతిమంతుడు. వేగులవాడుగా అతన్ని పంపటానికి తేజస్వి సమ్మతించాడు.

మతిమంతుడు వ్యాఘ్రనగరం చేరుతూనే రాజును సందర్శించి, "మహారాజా,

మీకు తేజస్వివల్ల అపాయం తొలగిందని భావించకండి. ఆయన నన్ను మీ రహస్యాలు తెలుసుకోమని పంపాడు. నాకు మీ రహస్యాలు అవసరం లేదు. మీరు మాత్రం కట్టుదిట్టాలతో ఉండటం మంచిది," అని చెప్పాడు.

శౌర్యవర్మ వెంటనే చుట్టుపక్కల రాజులందరినీ పిలిపించి, తేజస్వి తనపైన పడే పక్షంలో వారందరూ తనకు సహాయం వచ్చేటట్టు రహస్య ఒడంబడిక చేసుకున్నాడు. మతిమంతుడు శౌర్యవర్మతో, తాను లావణ్యవతిని పెళ్లాడ గోరుతున్నట్టు చెప్పాడు. శౌర్యవర్మ ఇందుకు ఆమోదం తెలిపాడు. అయితే లావణ్యవతి అదివరకే మాధవవర్మను ప్రేమించింది. మాధవవర్మ కూడా ఆమెను ప్రాణంతోసమంగా ప్రేమించాడు. తగిన సమయం వచ్చినదాకా వారు ఈ విషయం బయటపెట్ట దలచలేదు.

ఈ సంగతులేవీ తేజస్వి ఎరగడు. కాని మతిమంతుడు తనను వంచించినట్టు స్పష్టమయింది. అందుచేత ఆయన, "మీవద్ద వున్న రాజద్రోహి అయిన మతిమంతుణ్ణీ, నా విరోధి అయిన మాధవవర్మనూ వెంటనే వప్పగించక పోయినట్టయితే, మీరాజ్యాన్ని నేలమట్టంచేస్తాను!" అని బెదిరిస్తూ శౌర్యవర్మకు కబురుచేశాడు.



"మాపైకి యుద్ధానికి వచ్చేపక్షాన మీకు కిందటిసారికంటె పెద్ద పరాభవం చేసి పంపుతాము," అని శౌర్యవర్మ జవాబు పంపాడు. ఈ జవాబు చూడగానే తేజస్వికి, బెదిరింపులతో పని జరగదని తోచిపోయింది. అయన యుద్ధ ప్రయత్నాలన్నీ మాను కున్నట్టు నటించాడు.

మతిమంతుడు శౌర్యవర్మకు తేజస్వి గుట్టుమట్టులు చాలా చెప్పాడు; గజనగ రానికి వేగులవాళ్ళను పంపి అక్కడి వార్తలు తెప్పించటానికికూడా చాలా సహాయపడ్డాడు. ఇన్నిచేసిన మతిమంతుడు తన కుమార్తె అయిన లావణ్యవతిని కోరి ఉండటంవల్ల శౌర్యవర్మ తన కుమార్తెతో, "అమ్మా, నువు మతిమంతుణ్ణి చేసుకోవ టానికి ఒప్పుకోవటం మంచిది. అతను మనకు చాలా మేలుచేసి ఉన్నాడు. అతని రుణం మనం ఇంకోవిధంగా తీర్చుకోలేం. అదీగాక మన క్షేమం అతనిపై అధికంగా ఆధారపడి వుంది!" అని సలహా ఇచ్చాడు.

కాని లావణ్యవతి మాధవవర్మను పెళ్ళా డాలని ఏనాడో నిశ్చయించుకున్నది. ఆ సంగతికూడా శౌర్యవర్మకు తెలుసు. అయినా మాధవవర్మ ఈనాడు ఎందుకూ కొరగానివాడై పోయినాడు. రేపు యుద్ధమే వచ్చినా అతను పెద్ద ఎత్తున సహాయపడ





లేడు. అతనికోసం గజనగరపు ప్రజలు తిరుగుబాటుచేసే దశకూడా దాటిపోయింది.

కాని లావణ్యవతి తన మనసును మాధవ వర్మ మీదినుంచి మతిమంతుడి మీదికి మళ్ళించలేక, అతనిని చేసుకోవటం తన కిష్టంలేదని తండ్రితో చెప్పనూలేక తన నిర్ణయాన్ని వాయిదావేస్తూ రాసాగింది.

నిజానికి యుద్ధ భయం కలిగే లక్షణాలుకూడా ఏమీ లేవు. గజనగరానికి వెళ్లి వచ్చిన వేగులవాళ్ళు అక్కడ యుద్ధ ప్రయత్నాలేవీ లేవనీ, జీవితం ఒడుదుడుకులు లేకుండా సాగిపోతున్నదనీ చెప్పారు. దీనికి తగ్గట్టే తేజస్వివద్దనుంచి ఒక దూత వ్యాఘ్రనగరానికి వచ్చి ఒక ఆహ్వానం అందజేశాడు. "ఈసారి వసంతోత్సవానికి తమరు సబంధు పరివారంగా రావలెనని నా విజ్ఞాపన," అంటూ తేజస్వి శౌర్యవర్మకు ఆహ్వానం పంపాడు.

"మహారాజా, ఈ ఆహ్వానాన్ని నమ్మకండి! ఇందులో తప్పక ఏదో కుట్ర వున్నది," అని మతిమంతుడు శౌర్యవర్మను హెచ్చరించాడు. తేజస్వి ఆహ్వానాన్ని నిరాకరిస్తూ శౌర్యవర్మ దూతను సాగనంపాడు.

అంతేకాక శౌర్యవర్మ ఆయేడు తన రాజ్యంలోనే వసంతోత్సవం బ్రహ్మాండంగా చెయ్య నిశ్చయించుకుని, తనతో ఒడంబడికలు చేసుకున్న రాజులందరికీ ఆహ్వానాలు పంపాడు. వారందరూ వచ్చారు. విందులూ, వేడుకలూ గొప్పగా ఏర్పాటయాయి. లావణ్యవతి ఈ వేడుకలకు మరింత శోభ చేకూర్చింది.

వసంతోత్సవానికి ఆహ్వానం పొంది వచ్చిన వారిలో లావణ్యవతిని పెళ్ళాడగోరినవారు చాలామంది వున్నారు. ఈ ఉత్సవపు వేడుకలలోనే శౌర్యవర్మ తన కూతురి పెళ్ళిగురించి ఏదైనా ప్రకటన చేస్తాడని వారందరూ నమ్మారు. మతిమంతుడుకూడా అదే ఆశతో ఉన్నాడు.



ఒక్క మాధవవర్మకే ఈ వేడుకలలో ఏ ఆనందమూ లేదు. లావణ్యవతికి ఇంకా తనపై ప్రేమ ఉన్నదని అతనికి తెలుసు. తమకిద్దరికీ పెళ్ళి అయే అవకాశం లేదని కూడా అతనికి తెలుసు. తన భవిష్యత్తు అతనికి అయోమయంగా ఉన్నది. అతను విందుకు వెళ్లటానికికూడా ముఖం చెల్లక, మామూలువేళకు తన ఇంటనే భోజనం చేసి పడుకుని నిద్రపోయాడు.



అక్కడ రాజభవనంలో విందు ఉత్సాహంగా సాగుతున్న సమయంలో కొమ్ము బూరలు వినిపించాయి. భటుడొకడు రొజుకుంటూవచ్చి, "మహారాజా, ప్రమాదం! గజనగరపు రాజు పెద్ద సైన్యంతో నదిని దాటి వచ్చాడు. శత్రు సైనికులు నదీతీరాన గల గ్రామాలను తగలబెట్టేసి భీభత్సం చేస్తున్నారు!" అని చెప్పాడు.

ఎక్కడి వారక్కడ స్తంభించిపోయారు. శౌర్యవర్మ తాపీగా లేచి నిలబడి, నిశ్చలమైన కంఠంతో, "మిత్రులారా, తేజస్వి నన్ను ఈ ఉత్సవానికి ఆహ్వానించగా నేను వెళ్ళలేదు. అందుచేత ఆయన స్వయంగా బయలుదేరి వచ్చినట్టున్నది! ఆయనకు సరిఅయిన సత్కారం చెయ్యటానికి మీరంతా నాకు మీ చేయూత ఇవ్వండి!" అన్నాడు.

అతిథులలో ఒక్కరుకూడా మాట్లాడలేదు. వారు విందు కుడవటానికి వచ్చారు గాని, యుద్ధం చెయ్యటానికి రాలేదు. వారి సహాయం లేకుండా శౌర్యవర్మ ఈసారి శత్రువును జయించలేడు. ఎందుచేతనంటే ఈసారి ఆయన శత్రువు నెదుర్కొనేటందుకు సిద్ధంగా లేడు. ఆయనకు అపజయం తప్పదన్నట్టు కనబడింది.

ఆ సమయంలో లావణ్యవతి లేచి నిలబడి, "అతిథులారా, నన్ను పెళ్ళాడాలని ఉన్నట్టు మీలో చాలామంది అదివరలో అభిప్రాయం ప్రకటించారు. నిజం చెప్పేస్తున్నాను—నేను మాధవవర్మను చేసు

కుందామని అనుకున్నాను. కాని ఇప్పుడు దేశక్షేమం కోరి ఆ ఉద్దేశం మార్చుకుంటున్నాను. ఈ ఆపత్సమయంలో నా తండ్రికి మీలో ఎవరు ఎక్కువగా తోడ్పడతారో వారిని నేను మనస్ఫూర్తిగా పెళ్లాడతాను. ఇందుకు ఈశ్వరుడే సాక్షి!'' అని ఎలుగెత్తి చెప్పింది.

ఈ మాటలు వినగానే అందరిలోనూ ఒక్కసారిగా చైతన్యం ప్రవేశించినట్టయింది. లావణ్యవతిని గెలుచుకోవటం ఇక తమ వంతు. వారు భోజనాలముందునుంచి లేచి, తమ తమ బలాలను యుద్ధాని కాయత్తం చెయ్యటానికి బయలుదేరారు.

లావణ్యవతికూడా ఆ చీకటిసమయంలో రహస్యమార్గాల మాధవవర్మ ఇల్లు చేరింది. అతను గాఢనిద్రలో వున్నాడు. ఆమె అతన్ని లేపి, "ఒక వంక మానప్రాణాలకు హాని జరుగుతూంటే సుఖంగా నిద్రపోతున్నావా? లే, లే!'' అంటూ యుద్ధంగురించీ, తాను చేసిన వాగ్దానం గురించీ అతనితో చెప్పేసింది. "ఇదివరకు నిన్నే పెళ్లాడతానని మాట ఇచ్చివున్నాను. కాని ఇక ఇప్పుడు నన్ను భార్యగా గెలుచుకునే భారం నీపైన వున్నది,'' అని మాధవవర్మను హెచ్చరించి, వచ్చిన దారినే ఆమె అంతఃపురానికి తిరిగి వెళ్ళిపోయింది.



ఆమె వెళ్ళినాక కొంత సేపటిదాకా మాధవవర్మ మూఢుడిలాగా అలాగే కూర్చున్నాడు. ఆ తరవాత అతను బాకు ఒకటి తీసి బొడ్డున పెట్టుకుని బయలు దేరాడు. అతను అరణ్యంకుండా నదికేసి పోతూండగా ఒకపక్కన అలికిడి వినిపించింది. అతను జాగ్రత్తగా అటువేపు వెళ్ళి అక్కడ శత్రు సైనికుల శిబిరం వున్నట్టు గమనించాడు. తెల్లవారేదాకా వారు విశ్రమించి తెల్లవారుతూనే కోటపైకి వస్తారు. ఈ లోపుగా తాను ఏమైనా చెయ్యాలి.

మాధవవర్మ తానుకూడా ఆ సైనికులలో ఒకడులాగా, చాటుమాటు లేకుండా, ధైర్యంగా డేరాల మధ్యగా నడవసాగాడు. అతని నెవరూ అనుమానించలేదు, ఎవరూ అతనికేసి చూడనుకూడా లేదు. శిబిరమంతా మాటుమణిగేదాకా అటూ ఇటూ తిరిగి చివరకు మాధవవర్మ తేజస్వి గుడారం దగ్గిరికి చేరాడు. అతను గుడారం పక్క నేలమీద పడుకుని, పాములాగా పాకుతూ లోపలికి ప్రవేశించి, లేచి నిలబడ్డాడు.

గుడారంలో తేజస్వి గాఢనిద్రలో ఉన్నాడు. పక్కనే చిన్న కాగడా వెలుగుతున్నది. బొడ్డులోనుంచి బాకు పైకితీసి, మాధవవర్మ తేజస్విని సమీపించాడు. ఈ తేజస్వి అకారణంగా తమ రాజ్యంపై బడి





తన తండ్రిని చంపాడు, రాజ్యాన్ని హరిం చాడు, తనను కాందిశీకుణ్ణి చేశాడు! వీడే తన గర్భశత్రువు! వీడి ప్రాణాలిప్పుడు తన చేతిలో వున్నాయి! వీడు చస్తే తనకు రాజ్య ప్రాప్తి కలుగుతుంది; శౌర్యవర్మకు చుట్టు కున్న ఆపద గడుస్తుంది; లావణ్యవతి తన భార్య అవుతుంది!...కాని మాధవవర్మ తేజస్విని చంపలేదు. "ఎంత శత్రువైతే మాత్రం నిరాయుధుణ్ణి ఎలా చంపను? నావల్ల కాదు!" అనుకుని తన చేతిలో బాకును తేజస్వి తలపక్క దిండులో గుచ్చి మాధవవర్మ వచ్చిన దారినే కోటకు తిరిగి వెళ్ళిపోయాడు.

తెల్లవారేలోపుగా కోట రక్షణలన్నీ పూర్తి అయాయి. వసంతోత్సవానికి వచ్చిన వారంతా తమ పరివారాలకు ఆయుధా లిచ్చి, తాము ఆయుధాలు ధరించి కోటను రక్షించటానికి సిద్ధమై నిలబడ్డారు. ఇలా తయారైన వారిలో మతిమంతుడూ, మాధవ వర్మకూడా వున్నారు.

అరుణోదయంవేళ కోటముట్టడి ఆరంభ మయింది. రెండు మూడు గడియలలోపుగా కోట రక్షణలన్నీ చిందరవందర అయి పోయాయి. మహాసముద్రంలాగా శత్రు బలాలు కోటలో జొరబడ్డాయి. విజయ ధ్వానాలు మిన్నంటుతూండగా తేజస్వి దర్బారు ప్రవేశించాడు. ఓడిపోయిన శౌర్య వర్మ, ఆయన కుటుంబమూ, ఆయనకు తోడ్పడిన రాజులూ అదివరకే అక్కడికి చేర్చబడ్డారు.

తేజస్వి సింహాసనం దగ్గిరికి రాగానే, ఆ పక్కనే నిలబడివున్న శౌర్యవర్మ తన కిరీటం తీసి తేజస్వి పాదాలవద్ద వుంచాడు.

"అదేమిటి, శౌర్యవర్మా? నీ తల అది తీసుకుని తయారుచేసిన కిరీటం తీసేస్తా వెందుకూ? అది నీ తలమీద రాణించి నట్టుగా నా పాదాలదగ్గిర ఎలా రాణిస్తుంది? ఒక చిన్న అపోహలో మీరంతా పడిపోయా





రని నాకు తోస్తోంది. నేను కేవలం అతిథిగా వచ్చాను. వసంతోత్సవానికి అహ్వానిస్తే మీరు రాలేదు. అందుకని నేనే వచ్చాను. అయితే మీరు కోట ద్వారాలు మూసి, వాటికి సాయుధరక్షణలు పెట్టి మాకు శ్రమ కలిగించటంచేత నేరుగా రావటానికి బదులు కోట గోడలు దూకి రావలిసి వచ్చింది. నీ కిరీటం వుంచుకో, శౌర్య వర్మా. నేను పుచ్చుకునేటందుకు రాలేదు, ఇచ్చేందుకే వచ్చాను," అంటూ తేజస్వి ఒక బాకు పైకి తీశాడు.

"ఇది ఎవరిదో మీవాళ్ళలో ఒకరిది. వాళ్ళు దీన్ని నా గుడారంలో వదిలిపెట్టి వెళ్ళారు. ఆ వదిలిపెట్టిన వారెవరో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు తేజస్వి, చుట్టూ కలయచూస్తూ.

మాధవవర్మ ధైర్యంగా ముందుకు వచ్చి, "నేనే!" అన్నాడు.

"అయితే నా ప్రాణాన్ని కిందటి రాత్రి గుప్పిట్లో ఉంచుకున్నవాడివి నీవే నన్న మాట! భేష్, నీ ఋణం ఉంచుకోదలచ లేదు. నా చేతులో వున్నది నేను నీకిచ్చే స్తాను. నేనివ్వలేనిది శౌర్యవర్మ ఇస్తాడను కుంటాను. ఏం, శౌర్యవర్మా? నువు మన వాడికి నీ కూతుర్ని ఇచ్చే పక్షంలో నేను గజనగర సింహాసనం ఇచ్చేస్తాను. నాకూ పిల్లా జల్లా లేరు. ఈ ఇద్దర్నీ పెంచు కుంటాను. తథాస్తు అను మరి!" అన్నాడు తేజస్వి వుత్సాహంగా.

తన చెవులను తానే నమ్మలేక బొమ్మ లాగా నిలబడివున్న శౌర్యవర్మకు ఒక్క సారిగా చైతన్యం వచ్చింది. ఆయన తేజస్విని ఆలింగనం చేసుకున్నాడు. అప్పటి కప్పుడే గొప్ప విందుకు సన్నాహాలు జరి గాయి. మరి కొంతసేపటికి భోజనాలదగ్గిర కాబోయే భార్యా భర్తలు పక్క పక్కనే కూచున్నారు. తరవాత వారి వివాహం మహావైభవంగా జరిగింది. మాధవవర్మ

భార్యా సమేతుడై వెళ్ళి గజనగరపు కోటలో గృహప్రవేశం చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా! తన తండ్రి రాజ్యాన్ని కాపాడటానికి తన ప్రేమను బలిచేయ సిద్ధపడిన లావణ్యవతి ఔదార్యం గొప్పదా? నిరాయుధుణ్ణి చంప రాదనే ఉద్దేశంతో తన భవిష్యత్తునూ, ప్రేమనూ, తనకు ఆశ్రయం ఇచ్చిన శౌర్య వర్మ క్షేమాన్నీ త్యాగం చేసిన మాధవవర్మ ఔదార్యం గొప్పదా? తనను తన గర్భ శత్రువు చంపక వదిలినందుకు యుద్ధంలో లభించిన గెలుపునుకూడా వదులుకున్న తేజస్వి ఔదార్యం గొప్పదా? సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల బద్ద లవుతుంది," అన్నాడు.

"లావణ్యవతి గత్యంతరం లేని పరి స్థితిలో తన ప్రేమను త్యాగం చేసింది. మాధవవర్మ నిరాయుధుడైన శత్రువును చంపటానికే తేజస్వి గుడారం ప్రవేశిం చాడు. అతను ఆ పని చెయ్యకపోవటానికి కారణం అపకీర్తి భయం కావచ్చు. అందు చేత ఈ ఇద్దరి ఔదార్యమూ అంత ఉత్తమ మైనది కాదు. కాని తేజస్వి ఔదార్యం నిష్కళంకమైనది. తనను ఎవరో చంప వచ్చారన్న సంగతి అతనికి తప్ప మరెవరికీ తెలియదు. యుద్ధంలో విజయలక్ష్మి అతనిని వరించింది. అతని విజయాన్ని ఎవరూ కాదనలేరు. అందులో అపకీర్తి ఏమీలేదు. తనను చంపకుండా వదిలిపెట్టిన వాడెవరో తెలియకముందే అతను తన విజయలక్ష్మిని శౌర్యవర్మకు ధారపోశాడు. అతను తన శత్రుశేషమైన మాధవవర్మ అని తెలిసినాక తన నిశ్చయాన్ని ఏంతమాత్రమూ మార్చుకోలేదు. తేజస్వి ఔదార్యం గొప్పది," అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతోసహా వెళ్ళి చెట్టెక్కాడు. (కల్పితం)



# ఆదిమమానవుల పరికరాలు

సుమారు 6 న్నర లక్షల ఏళ్ళక్రితం మానవుడు రాతితో తనకు కావలిసిన పరికరాలు చేసుకోవటం ప్రారంభించిన సంగతి మనం లోగడ తెలుసుకున్నాం. ఇదే పాత రాతియుగానికి నాంది. ఈ యుగం సుమారు 10 వేల ఏళ్లక్రితం ముగిసింది. తొలిదశలో పరికరాల నిర్మాణం అంతగా అభివృద్ధి కాలేదు. మానవుడు చేసిన మొట్టమొదటి పరికరాలు నరకటానికి పనికవచ్చేవి. వీటిని మానవుడు స్ఫటికశిలతోనూ, ఘనీభవించిన లావాతోనూ తయారుచేశాడు. ఈ పరికరమే క్రమంగా అభివృద్ధిఅయి చేగొడ్డలిగా మారింది. చెకుముకి రాయిని చెక్కి ఈ గొడ్డలి తయారుచేసేవారు. చెక్కడంలో ఊడిన పెళ్ళలను గీరటానికీ, కొయ్యటానికీ, డొలచటానికి ఉపయోగించేవారు. పరికరాలు చెయ్యటంలో నైపుణ్యం అభివృద్ధి అయినకొద్దీ రాతిగొడ్డలి కూడా అభివృద్ధి పొందింది.

కాలం గడిచినకొద్దీ, చెక్కిన రాళ్లతో చేసిన పరికరాలకన్న రాతి పెళ్ళలే ముఖ్యమైన అయుధాలుగా పరిణమించాయి. ఈ పరిస్థితి **1,70,000** ఏళ్ళక్రితం యేర్పడింది. అది లగాయతు **37,000** ఏళ్లక్రితందాకా నియాండర్తాల్ మనిషి ప్రపంచమంతటా యేలాడు. ఈ మనిషి రాతిములుకులు గల బాణాలతోనూ, బరిసెలతోనూ మృగాలను వేటాడాడు.

భూమిపై నాలుగుసార్లు హిమప్రళయం వచ్చింది. అప్పుడు ఉత్తర ధృవంనుంచి భూమధ్యరేఖ వేపు మంచు పాకివచ్చింది. నాలుగో హిమప్రళయం **70,000** యేళ్ళక్రితం జరిగింది. అప్పుడు మానవులు మంచుకు దడిచి దక్షిణంగా పారిపోక, తాము నేర్చిన విద్యల సహాయంతో చలినుంచి ఆత్మరక్షణ చేసుకోగలిగారు.

**37,00** యేళ్లక్రితంనుంచి **10,0000** యేళ్ళక్రితందాకా నడిచిన కాలంలో మానవుడి పరికరాలు చాలా అభివృద్ధికి వచ్చాయి. మొదటి **7,000** యేళ్ళ కాలంలో చెకుముకి కత్తులు తయారయాయి. మనుషులు తోళ్ళతో ఉడుపులు తయారుచెయ్యటం నేర్చుకున్నారు. ఆ తరువాత రకరకాల ఉలులు తయారయాయి. ఈ ఉలుల సహాయంతో అనేక పదునైన అయుధాలు, యెముకతోనూ, కొమ్ముతోనూ చేసినవి, తయారయాయి. 20 వేల, 16 వేల యేళ్ళక్రితం మధ్యలో మానవులు చెకుముకిరాతినుంచి సన్నని పొరలు వేరు చేయటం నేర్చారు. ఈ పొరలనుంచి అనేక పరికరాలు తయారయాయి. పాతరాతియుగం తాలూకు అఖరు 6 వేల ఏళ్ళ కాలంలో బెజ్జం గల సూదీ, శూలమూ, ముళ్ళ ఈటె తయారయాయి.

10 వేల ఏళ్ళక్రితం పాతరాతియుగం ముగిసేనాటికి మానవుడు తన పురోభివృద్ధికి అవసరమైన ప్రాథమిక పరికరాలనన్నిటినీ సిద్ధంచేసుకున్నాడు; దుస్తులు ధరించటమూ, వంట చేసుకోవడమూ నేర్చుకున్నాడు. అతనికి వ్యవసాయం ఇంకా తెలీదుగాని, అనేక రకాల ఆయుధాలతో దీటులేని వేటగాడుగా మటుకు తయారయాడు.




# కృతఘ్నుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తూండగా బోధిసత్వుడు కోసలరాజుగా జన్మించాడు. ఆయనకు సత్యసేనుడని ఒక కుమారుడుండేవాడు. యుక్తవయసు రాగానే రాజు సత్యసేనుణ్ణి యువరాజుగా చేశాడు. యువరాజు భార్య శంబులాదేవి అపురూప సౌందర్యవతి.

దురదృష్టవశాత్తూ యువరాజుకు భయంకరమైన కుష్ఠువ్యాధి వచ్చింది. ఎంతమంది వైద్యులు ఎన్ని చికిత్సలు చేసినా ఆ వ్యాధి లొంగక అనాటికానాడు ఎక్కువ కాసాగింది. అటువంటి వ్యాధి పెట్టుకుని నలుగురి మధ్యా ఉండటానికి నామోషీ వేసి, యువరాజు తండ్రి అనుమతితో, నిర్జనారణ్యంలో ఉండటానికి బయలుదేరాడు. అప్పుడు శంబులాదేవికూడా తన భర్తవెంట వనవాసానికి బయలుదేరింది. యువరాజు వద్దని ఎన్నివిధాల చెప్పినా ఆమె వినలేదు.

అరణ్యంలో జలసమృద్ధీ, ఫల సమృద్ధీ ఉన్నచోట యువరాజు ఒక పర్ణశాల నిర్మించుకుని అందులో ఉండసాగాడు. శంబులాదేవి ఉదయమే లేచి ఇంటిపను లన్నీ చేసి, భర్తకు పలుదోము పుల్లా, నీళ్ళూ ఇచ్చి, అతను ముఖం కడుక్కున్నాక తినటానికి పళ్లు ఇచ్చి, తట్టా గునపమూ తీసుకుని అడివిలోకి వెళ్లేది. పళ్ళూ, కందమూలాలూ తెచ్చేది. చెరువునుంచి నీరు తెచ్చేది. భర్తచేత స్నానం చేయించేది. తరవాత భర్తకు భోజనం పెట్టి తాను భోజనంచేసేది. ఈవిధంగా ఆమె అహోరాత్రాలు భర్తను కనిపెట్టి ఉంటున్నది.

ఒకనాడామె పళ్లకోసమని కొత్తవైపుగా బయలుదేరింది. కొంతదూరం వెళ్ళేసరికామె కొక కొండకోన కనిపించింది. ఆ కోనలో కోనేరు ఒకటున్నది. దాన్ని చూడగానే ఆమెకు అందులో స్నానంచెయ్య

బుద్ధిపుట్టింది. ఆమె అందులో స్నానం చేసి బయటికి వచ్చేసరికి ఆమె శరీరం మేలిమి బంగారు చాయతో ప్రకాశించసాగింది.

ఈ సంగతి ఆమెగమనించలేదు గాని ఆ సమయానికి అటుగా పోతున్న కిరాతు డొకడు ఆమెను చూసి నిర్ఘాంతపోయి ఆగాడు. వాడు ఆమెను తమ గూడెముకు రమ్మనీ, తనను పెళ్ళాడమనీ బతిమాలాడు. ఆమె దారికి అడ్డు నిలబడి కదలనివ్వలేదు. ఇది చూసి శంబులాదేవి, "ఓరీ, పాపా త్ముడా! నాశనమైపోతావు!" అంటూ బిందెలో నీరు వాడిమీద చల్లింది. పిడుగు దెబ్బ తిన్నవాడల్లే వాడు పడిపోయాడు.



కిరాతుడి బెడద వదిలించుకుని నీరూ, పళ్ళూ తీసుకుని పర్ణశాలకు తిరిగి వచ్చే సరికి చాలా పొద్దుపోయింది. భర్త, "ఇంత ఆలస్యమయిందేం?" అని అడిగాడు.

శంబులాదేవి జరిగినదంతా చెప్పింది. కాని భర్త నమ్మక, "ఆడవాళ్లు ఎన్నయినా కల్పించగలరు? ఎక్కడ తిరిగినా నిన్ను అడిగేవాళ్లు లేరు!" అన్నాడు.

"స్వామీ, నేను చెప్పేది సత్యమైతే మీ వ్యాధి ఈ నీటితో నయమైపోవాలి!" అంటూ బిందెతో తెచ్చిన నీరు భర్తకు అభిషేకం చేసింది. వెంటనే, ఇంద్రజాలంలాగా, అతని వ్యాధి తుప్పురాలినట్టు రాలిపోయి, అతని శరీరంకూడా బంగారంలాగా మెరవ సాగింది. తన భార్య పాతివ్రత్యంకంటె, తనకు వ్యాధి నయమయిందన్న విషయం సత్యసేనుడికి ఎక్కువ ఆనందం కలిగిం చింది. అతను వెంటనే బయలుదేరి కోసల రాజధానీ నగరానికి వచ్చి ఉద్యానవనంలో విడిదిచేసి తన రాకనుగురించి తండ్రికి కబురుచేశాడు.

రాజుగారు స్వయంగా ఛత్రచామరాలతో బయలుదేరి ఉద్యానవనానికి వచ్చి తన కుమారుడికి స్వాగతం చెప్పాడు. యువ రాజు వ్యాధి నయంకావటానికిగాను సహాయ

పడినందుకూ, అతనితో సమంగా అరణ్య వాసం చేసినందుకూ, శంబులాదేవికి పట్టపు రాణీ హోదా ఇస్తూ ఉత్తరువు చేశాడు. తాను వానప్రస్థం స్వీకరించి సత్యసేనుడికి రాజ్యాభిషేకం చేసేశాడు.

తండ్రి ఉత్తరువు ననుసరించి సత్యసేనుడు శంబులాదేవిని పట్టపురాణిగా చేసుకున్నాడే గాని, ఆమెపట్ల పూర్తిగా ఉదాసీనుడై తన ఇతర భార్యలతోనే ఎక్కువగా కాలం గడపసాగాడు. భర్తయొక్క అనాదరణవల్లా, సవతుల ఈర్ష్యవల్లా శంబులాదేవి చిక్కి శల్యమై పోయింది.

ఇలా వుండగా ఒకనాడు మామగారు శంబులాదేవి ఇంటికి భోజనానికి వచ్చాడు. ఆమె స్థితికి ఆశ్చర్యపడి, ఎందుకిట్లా కృశించిపోయావు?" అని అడిగాడు.

"భర్త ఆదరణ లేని భార్య ఇంకెట్లా ఉంటుంది, చెప్పండి?" అన్నది శంబులాదేవి.

ముసలిరాజు జరిగిన దంతా విని సత్యసేనుణ్ణి పిలిపించి, "నాయనా, కృతఘ్నత కంటె మహాపాతకం ఇంకొకటి లేదు. భయంకరమైన వ్యాధితో నువు మనుష్యుల మధ్య ఉండలేక అరణ్యానికి పారిపోయి నప్పుడు నీవెంట వుండి, రాత్రిం బగళ్ళు నీకు సేవచేసి, చివరకు నీ వ్యాధికూడా నయంచేసిన భార్యను, రాజ్యం చేతికి చిక్కగానే తృణీకరిస్తావా? ఈ రాజ్యాలూ, వైభవాలూ ఎవరికైనా లభిస్తాయి. కాని పతివ్రత అయిన భార్య ఎవరో అదృష్ట వంతుడికిగాని లభించదు. కనక శంబులా దేవిని అనాదరంతో చూడకు. అందువల్ల నష్టపడేది నువే!" అని బోధించాడు.

సత్యసేనుడు జ్ఞానోదయం కలిగిన వాడై భార్యకు క్షమాపణ చెప్పుకుని, ఆమెకు తనపైనా తన ఇతర భార్యలపైనా అంతు లేని అధికారాలిచ్చి, ఆమెను ఆదరంతో చూస్తూ కాలం గడిపాడు.






# తల్లీ కూతుళ్లు

## 6

రెండు ప్రయత్నాలు విఫలమైనా పాదరసం ఆశ విడిచిపెట్టలేదు. అతను మూడో సారి పాములవాడి వేషం వేసుకుని, బుట్టలో మూడు తాచులు పెట్టుకుని జురేక్ దుకాణం ముందు వాటిని ఆడించసాగాడు. ఆడిస్తున్నట్టే ఆడిస్తూ పాదరసం ఒక కోడె తాచును, దుకాణంలోకి, జురేక్ కాళ్ళ ముందు పడేట్టు విసిరివేశాడు. జురేక్ హడలెత్తి అవతలికి పారిపోయాడు. ఆ గందరగోళంలో పాదరసం సంచీని అందుకున్నాడు. కాని మరుక్షణంలోనే జురేక్ తిరిగివచ్చి, ఒక సీసంగుండుతో పాముతల చితకగొట్టి, మరోగుండు పాదరసం వేపు విసిరాడు. పాదరసం పక్కకు తప్పుకున్నాడు. గుండు వెళ్ళి వీధి వెంట పోయే ముసలిదానికి తగిలి, ఆమెను తక్షణమే పరలోకానికి పంపేసింది.

చుట్టుపక్కలవాళ్లంతా జురేక్‌ను తన్నబోయారు. వారికి భయపడి జురేక్ మండిగంలోనుంచి ఆ సంచీ తీసెయ్యటానికి ఒప్పుకున్నాడు. ఆయన తన వంటఇంట్లో గొయ్యి తవ్వి, అందులో సంచీ పూడ్చేశాడు.

"సంచీ దించనే దించావు. ఆ డబ్బు పిల్లవాడి పుట్టినరోజు పండక్కు ఖర్చుచేద్దాం," అన్నది జురేక్ భార్య. కాని జురేక్ వినలేదు. ఆ రాత్రి జురేక్‌కు ఒక కల వచ్చింది. ఏదో పక్షి తన వంటఇంట్లో ముక్కుతో తవ్వి డబ్బుసంచీ పైకి లాగుతున్నదిట. జురేక్ కంగారుపడుతూ లేచి భార్యతో, "ఒసే, ఏదో పక్షి వంటఇంట్లో తవ్వుతున్నది. వెళ్లి చూడవే!" అన్నాడు. జురేక్ భార్య దీపం తీసుకుని వంటఇంట్లోకి వెళ్లింది. అక్కడ పక్షి అయితే లేదుగాని, కిటికీలోనుంచి ఎవరో దూకి పోవటం

ఎన్. వెంకటసుబ్బయ్య




మటుకు ఆమె కళ్లపడింది. ఆ మనిషి చేతిలో డబ్బుసంచీ ఉంది!

అది కాజేసినవాడు పాదరసం అలీయే. అతను అక్కడే ఉండి, సంచీని వంటఇంట్లో దాయటం గమనించి, రాత్రి వచ్చి దాన్ని కాస్తా సంగ్రహించాడు.

"నీ నోరు బడ! డబ్బు పిల్లవాడి పుట్టిన రోజుకు ఖర్చుచెయ్యమంటే లేదన్నావు! ఇప్పుడది కాస్తా దొంగవాడు దోచుకు పోయాడు!" అని జురేక్ భార్య ఏడిచింది.

"అదెక్కడికి పోతుందే? ఇప్పుడు తీసుకురానూ?" అంటూ జురేక్ హడావిడిగా అక్కడినుంచి బయలుదేరాడు.

"సంచీ లేకుండా ఇంటికి వచ్చావో, నీకు తలుపుకూడా తెరవను!" అన్నది భార్య.

ఈ సంచీకోసం మూడు యత్నాలు చేసిన దెవరో జురేక్‌కు బాగా తెలుసు. పాదరసం కొత్వాలు అహ్మద్ ఇంట్లో ఉంటున్నట్టుకూడా ఆయన ఎరుగు. అందు చేత ఆయన అడ్డదార్లవెంబడి ముందుగా అహ్మద్ ఇల్లు చేరి, మారుతాళంతో బయటి తలుపు తెరిచి దాని వెనక్క వెళ్లి మూసి, పాదరసంకోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

ఇంతలో పాదరసం వచ్చి తలుపు తట్టాడు. జురేక్ అహ్మద్ గొంతుతో, "పాదరసం, నువేనా?...సంచీ తెచ్చావా?... ఏదీ? తలుపు కిందుగా లోపలికి తొయ్యి! నేనూ, హసన్ పందెం వేసుకున్నాంలే! భలే గమ్మత్తయిన పందెం! తలుపు తెరిచి అంతా చెబుతా!" అన్నాడు.

ఆ మాట్లాడేది అహ్మదే ననుకుని పాదరసం సంచీని తలుపుకిందుగా లోపలికి తోశాడు. జురేక్ అది తీసుకుని అహ్మద్ ఇంటి మెట్లెక్కి మిద్దెమీదికి పోయి, ఆ మిద్దె మీదినుంచి పక్క మిద్దెమీదికి దాటి, అవతలి ఇంటి మెట్లు దిగి, ఆ యింటి తలుపు తెరుచుకుని వీధి ఎక్కి, పరమానందంతో ఇంటివేపు సాగాడు.

పాదరసం ఒకటి రెండుసార్లు తలుపు తట్టి చూశాడు. ఏ అలికిడీ లేదు. జురేక్ తనను మోసగించాడా అనుకున్నాడు. వేగంగా అడ్డదార్లవెంబడి పరిగెత్తి జురేక్ ఇల్లు చేరాడు. లోపలికి ప్రవేశించాడు. మిద్దెమీద పడకగదిలో జురేక్ భార్య పిల్ల వాణ్ణి పెట్టుకుని నిద్రపోతున్నది. పాద రసం ఆమె లేచేలోపల చేతులూ కాళ్లూ కట్టేశాడు. కుర్రవాణ్ణి ఒక తట్టలో పడుకో బెట్టి జురేక్‌కోసం తలవాకిట వేచి ఉన్నాడు.

ఇంతలో జురేక్ వచ్చి తలుపు తట్టాడు. పాదరసం జురేక్ భార్యగొంతుతో, "సంచీ దొరికిందా?" అని అడిగాడు.

"ఇదుగో, తెచ్చాను," అన్నాడు జురేక్.

"బుట్టలో పెట్టు, డబ్బు లెక్కచూసు కునిగాని తలుపు తెరవను," అన్నాడు పాదరసం, జురేక్ భార్యగొంతుతో. అతను ఒక చిన్న బుట్టకు తాడుకట్టి దించి, సంచీ పైకి చేదుకున్నాడు. తరవాత సంచీ తీసుకుని, పిల్లవాడున్న తట్ట ఎత్తుకుని అహ్మద్ ఇంటికి వెళ్లిపోయాడు.

ఎంతసేపటికీ తలుపు తెరుచుకోక పోవటం చూసి జురేక్ తలుపుమీద బాద నారంభించాడు. చుట్టుపక్కల వాళ్లంతా చేరారు. ఎన్నికేకలు పెట్టినా అతి గతీ



లేదు. చివరకు అందరూ కలిసి తలుపులు పడదోసి లోపలికి వెళ్ళిచూస్తే జురేక్ భార్య మంచానికి కట్టేసి ఉంది. సంచీ జాడ లేదు సరేకదా, పిల్లవాడుకూడా లేడు!

జురేక్ తన భార్య కట్లు విప్పి జరిగిన దంతా తెలుసుకుని, జుట్టు పీక్కుని, అప్పుడే అహ్మద్ ఇంటికి వెళ్లి దబదబా తలుపుతట్టాడు. అప్పటికే తెల్లవారుతున్నది. లోపల అంతా మేలుకునే ఉన్నారు. జురేక్ పాదరసం అలీని చూస్తూనే, "డబ్బు సంచీ నువు సంపాదించుకున్నా వనుకుం టాను. నీపుణ్యం ఉంటుంది, నాపిల్లవాణ్ణన్నా నాకిచ్చెయ్యి!" అని వేడుకున్నాడు.

"తొందరపడకండి. మీకు డబ్బుసంచీ దొరుకుతుంది, పిల్లవాడూ దొరుకుతాడు. కాస్త మావాడికీ మీ మేనగోడలు జీనాబ్‌కూ పెళ్ళిముహూర్తం పెట్టించి మరీ వెళ్లండి!" అన్నాడు హసన్ జురేక్‌తో.

"తొందర పడకండి. జీనాబ్‌ను అలీకిచ్చి చెయ్యటానికి నాకేనాడూ అభ్యంతరం లేదు. కాని జీనాబ్ సంతలో కొన్నట్టు కొనటానికి గొర్రెపిల్ల కాదు. దాన్ని పెళ్ళాడేవాడు భరణం ఇవ్వవలసి ఉంటుంది," అన్నాడు జురేక్.

"తప్పక ఇస్తాను, ఏమివ్వాలి?" అన్నాడు పాదరసం ఆత్రంగా.

"అజరయ్యా కూతురు కమర్ దగ్గిర వుండే బంగారు దుప్పటీ, బంగారు శిరోభరణమూ, బంగారు వడ్డాణమూ, బంగారు చడావులూ తెచ్చినవాణ్ణి చేసుకోవాలని జీనాబ్ అభిప్రాయం. అవి నువు తెచ్చి జీనాబ్‌కు భరణంగా ఇవ్వగలిగితే పెళ్ళికి నా అభ్యంతరం ఏమీ లేదు," అన్నాడు జురేక్. "తెస్తాను," అన్నాడు పాదరసం అలీ.

జురేక్ తన పిల్లవాణ్ణీ, డబ్బు సంచీనీ తీసుకు వెళ్ళిపోయాక, హసన్ పాదరసంతో, "నీకేమైనా పిచ్చా ఏమిటి? ఇటువంటి పని ఎందుకు మీద వేసుకున్నావు? అజరయ్యా మంత్రాలూ, చేతబడులూ నేర్చినవాడు.



వాడికి భూతపిశాచాలు పలుకుతాయి. వాడు బాగ్దాద్‌నగరం గోడల బయట, బంగారు వెండి ఇటుకలతో కట్టిన భవంతిలో వుంటాడు. రాత్రిపూట వాడు యింటో వున్నప్పుడు తప్ప ఆ ఇల్లెవరికీ కనిపించదు. పగలల్లా వాడు నగరంలో వడ్డీవ్యాపారం చేస్తాడు. రాత్రివేళ ఇంటికి వెళ్ళి కిటికీలో నిలబడి, తన కూతురి బంగారు దుప్పటి ఒక బంగారు పళ్ళెంలో పెట్టి పట్టుకుని, "ఇరాక్, ఇరాన్, అరేబియాలో గల ఏ గజ దొంగ అయినా సరే దీన్ని కాజెయ్యండి, చూస్తాం," అంటాడు. ఎంతమంది దొంగలో ఆ దుప్పటి కాజెయ్యటానికి యత్నించి నాశనమైపోయారు. వారిలాగే నిన్నుకూడా నాశనం చేయించాలనే దురుద్దేశంతోనే జురేక్ నిన్ను ఉసికొల్పాడు. ఈ పని నీవల్ల అయేదిమాత్రం కాదు!" అన్నాడు.

"ఏమన్నానో అన్నాను. జీనాబ్‌ను పెళ్ళికూతుర్ని చేసినప్పుడు ఆ బంగారు దుప్పటి కప్పి, బంగారు శిరోభరణం పెట్టి, బంగారు వడ్డాణం చుట్టి, బంగారు చడావులు తొడిగి మరీ పెళ్ళాడతాను!" అన్నాడు పాదరసం ధైర్యంగా.

వాణ్ణి ఎవరూ ఆపలేకపోయారు. వాడు అప్పుడే బయలుదేరి అజరయ్యా దుకాణానికి వెళ్ళాడు. అజరయ్యా బంగారాన్ని





సంచులలో తూయించి, గాడిదమీద వేయిస్తున్నాడు. అజరయ్యా దుకాణం మూసి గాడిదమీద సవారీఅయి ఇంటికి బయలుదేరేదాకా దూరంగా వేచివుండి, అలీ అతన్ని వెంబడిస్తూ ఊరి వెలపలకు వెళ్ళాడు.

అజరయ్యా ఒక చోటికి వచ్చి, సంచీలో నుంచి ఇంత ఇసుక తీసి, మంత్రించి, గాలిలో చల్లాడు. వెంటనే ఎదురుగా ఒక భవనం ప్రత్యక్షమయింది. ఆ భవనం బంగారు ఇటుకలతో, వెండి ఇటుకలతో కట్టివున్నది. అజరయ్యా గాడిదమీద భవనంలో ప్రవేశించాడు. మరి కొంతసేపటికి ఆయన కిటికీ తెరిచి, చేతిలో బంగారు పళ్ళెంలో బంగారు దుప్పటి పెట్టి పట్టుకుని నిలబడి, "ఇరాక్, ఇరాన్, అరేబియాలలో గల గజదొంగల్లారా! చాతనయితే ఈ నా కూతురి సొత్తు దొంగిలించి ఆమెను పెళ్ళాడండి!" అన్నాడు.

అజరయ్యాను మంచిగా అడిగి ఆ వస్తువులను బహుమానంగా పుచ్చుకోవాలని అలీకి తోచింది. "అయ్యా, తమతో ఒక్కసారి మాట్లాడాలి," అన్నాడతను అజరయ్యాతో.

"పైకి రా!" అన్నాడు అజరయ్యా.

పాదరసం పైకి వెళ్ళి అజరయ్యాతో తన అవసరం గురించి చెప్పాడు. అజరయ్యా అంతా విని గట్టిగా నవ్వి, పాదరసం చెయ్యి పరీక్షించి, "నీకు ప్రాణంమీద ఆశ వుంటే, నా సలహా తీసుకుని, ఈ ప్రయత్నం మానుకో. ఎవరో నీ కీడు గోరి నిన్ని పనికి పురికొల్పారు. నా ఆయుర్దాయంకంటె నీకు ఎక్కువ వున్నది. లేకపోతే నిన్ను ఈ క్షణాన చంపివుందును!" అన్నాడు.

అలీ మండిపడి, కత్తిదూసి, "దుర్మార్గుడా! నేను కోరినది ఇవ్వకపోతే నిన్ని క్షణంలో చంపేస్తాను!" అన్నాడు.

"ఆ చెయ్యి పడిపోవాలి!" అన్నాడు అజరయ్యా. మరుక్షణం పాదరసం కుడి చెయ్యి చచ్చుపడిపోయింది. పాదరసం





కత్తిని ఎడమచేతిలోకి తీసుకున్నాడు, కాని అజరయ్యా మహిమవల్ల అదీ పడిపోయింది.

"ఇప్పటికైనా నీ ప్రయత్నం మానుకుంటావా?" అన్నాడు అజరయ్యా.

"నాకా దుప్పటీ అవీ కావాలి!" అన్నాడు పాదరసం.

"అందుకు ఒకటే మార్గం! గాడిదవై వాటిని మొయ్యి!" అంటూ అజరయ్యా పాదరసంమీద నీళ్లు మంత్రించి చల్లాడు. వెంటనే అలీ కాస్తా గాడిద అయిపోయాడు.

మర్నాడు అజరయ్యా దుకాణానికి పాదరసాన్ని తోలుకుపోయాడు. ఆ రోజు సాయంకాలం ఇంటికి వచ్చాక అజరయ్యా అలీని మళ్ళీ మనిషిని చేసి, "ఎందుకు చెడతావు? నా సలహా విని వెళ్లిపో. లేకపోతే ఇంకా హీనమైన జంతువుగా మార్చగలను," అన్నాడు. అలీ ఆ మాటలేవీ వినిపించుకోక అజరయ్యా మీదికి వురికాడు. అజరయ్యా అతనిమీద ఇన్ని నీళ్లు చిలకరించి అతన్ని యెలుగుబంటిగా మార్చేశాడు.

మర్నాడు అజరయ్యా కూతురు కమర్ తండ్రితో, "నాన్నా, ఈ అబ్బాయి నన్ను పెళ్ళాడతాడేమో అడుగు," అని అడిగింది.

"నువే అడుగు," అంటూ అజరయ్యా కోపంగా తన గదిలోకి వెళ్ళాడు.

"నీకు కావలిసింది నేనా, నా వస్తువులా?" అని కమర్ పాదరసాన్ని ప్రశ్నించింది.

"దిలైలా కూతురు జీనాబ్ అనే అందగత్తెకు భరణంగా ఇవ్వటానికి నీ వస్తువులే నాకు కావాలి," అన్నాడు పాదరసం అలీ.

"వాడి మనసు మారదు, చూశావా?" అన్నాడు అజరయ్యా కూతురితో. తరవాత ఆయన అలీమీద నీళ్లు చల్లి కోతిని చేశాడు.

ఆ రాత్రి కమర్ ఒక నిశ్చయానికి వచ్చేసింది. ఆమె పాదరసం అలీకి సహాయం చెయ్యా నిశ్చయించింది. అతను తనను పెళ్ళాడకపోయినా అతని సుఖంకోసం తన





వస్తువులు ఇచ్చెయ్యా దలచింది. అందు చేత ఆమె ఆ రాత్రి తన తండ్రితో శతపోరి అతణ్ణి ఒప్పించింది. తరవాత తన వస్తువు లన్నీ బంగారు పళ్ళెంలో పెట్టుకుని, కోతి రూపంలో వున్న పాదరసందగ్గిరికి పోయి, అతన్ని మనిషిగాచేసి, "అలీ, ఇవి తీసుకో! నువు కోరే జీనాబ్‌ను పెళ్ళాడు," అన్నది.

పాదరసం అలీకి కమర్‌పట్ల చాలా అభిమానం కలిగింది. అతను ఆమెను వెంటబెట్టుకుని హసన్, అహ్మద్‌లవద్దకు వెళ్ళాడు. "నువు జీనాబ్‌ను పెళ్ళాడిన తరవాత కమర్‌ను కూడా పెళ్లాడటం వుచితం. ఈమె తండ్రి కీమె ఒక్కతే కుమార్తెగనక అతని ఆస్తికూడా అతడి తద నంతరం చట్టంప్రకారం నీకే దక్కుతుంది," అని వారు అన్నారు.

తరవాత వాళ్లు దిలైలానూ, జీనాబ్‌నూ, జురేక్‌నూ పిలిపించారు. జురేక్ సాక్షిగా పాదరసం జీనాబ్‌కు కమర్ బంగారు దుప్పటీ, శిరోభరణమూ, వడ్డాణమూ, చడా వులూ భరణంగా ఇచ్చాడు. జురేక్, తన మేనకోడలైన జీనాబ్ పాదరసం అలీని పెళ్ళాడటానికి ఒప్పుకున్నాడు.

ఈ భరణం సంపాదించటానికి పాద రసం పడిన కష్టాలనుగురించి విని జీనాబ్, అలీ కమర్‌ను పెళ్ళాడటానికి ఆమోదిం చింది. త్వరలోనే పాదరసం అలీకీ జీనాబ్‌కూ పెళ్లి అతివైభవంగా జరిగింది.

తరవాత కొద్దిరోజులకు పాదరసం ఖలీఫా దర్శనం చేసుకుని తనను కొలువులో ఉంచుకోమని అర్జీపెట్టుకున్నాడు. ఆ అర్జీని ఇద్దరు కొత్వాళ్లూ, పావురాల టపా నిర్వాహకు రాలూ బలపరచటంవల్ల ఖలీఫా పాద రసం అలీని రాజభటులకు సర్దారుగా నియమించాడు. నెలకు వెయ్యి దీనారాలు వేతనం తీసుకుంటూ పాదరసం జీనాబ్, కమర్‌లతో సుఖంగా కాలం గడిపాడు.

(అయిపోయింది)





# మిత్రభేదం

ఇది యిట్టులుండగా - మృగముల రాజు
కదలె పింగలకుడు - కానలోనుండి.
యమునా జలమ్ముల - హాయిగా గ్రోల
తమ మృగమ్ముల నెల్ల-తరలించుకొనుచు
వచ్చెను దేవేంద్ర - వైభవ మొప్ప
అచ్చట మడుగులో - నడుగిడ నుండె.
సంజీవకుని అంకె - సకల దిక్కులను
భంజించుకొని విన - వచ్చె నంతటను.

గుండెలు గబగబ - కొట్టుకోసాగె
నిండు సైన్యమ్మెల్ల - నివ్వెఱపడియె
వెనుకంజ వేసి ఆ - వనరాజు జడిసి
పెను మఱ్ఱిచెట్టు నీ-డను చేరుకొనియె.

కొలువు దీఱెను మృగ-మ్ముల రాజరాజు
పిలపిల మృగములు - నిలుచుండె వరుస.
తొలుతటి వరుసలో - దొర గూరుచుండె
మలి వరుసను పెద్ద-పులి జాతి చేరె

పక్షులు మూడవ - వరుసలో చేరె
లక్ష చిల్లరవి నా-ల్గవ బారు తీరె.

ఇది యంతయును చూచి-ఏమి ఏమనుచు
కొదమ నక్కలు రెండు-గుసగుసపోయె.

మృగరాజు నాస్థాన - మెంతయు జేరి
మిగిలిన యెంగిళ్ళ - మెక్కుచు దిరుగు
కరటక దమనకా-ఖ్యమ్ము లా రెండు
మొరటు నక్కలు తంత్ర-ములకెల్ల నిధులు.

మంత్రివంశమె గాని - మారె కాలమ్ము
మంత్రి ఉద్యోగమ్ము - మంటలో గలిసె.
ఆ సమయమ్మున - నా రెండు నక్క
లాసతో దూరమ్ము - నందున జేరి

తమ రాజు సంగతి - తర్కింప దొడగె
దమనకుం డిట్లనె - తన మిత్రుతోడ:

దమనకుడు:

కరటకా మన దొర - గతి చూడుమోయి.
సరగున నీటికై - చనుదెంచి, పోక
దప్పి జెందియు నీరు - ద్రావక తిరిగి
గప్పున వ్యూహమ్ము - గావించినాడు.

విద్వాన్ విశ్వం




కరటకుడు :

దమనకా! మనకేల - దారి సంగతులు ?
తమకు చెందనివాని - తలిసీ ళ్ళవేల ?
ఉడత కెందులకోయి - ఊరి పెత్తనము ?
బుడబుడ పెఱపనుల్ - మెడవేసుకొన్న

కొనకేమొ కథలోని - కోతి చందాన
అసలుకే మోసమై - అడలిపోవలయు.

దమనకుడు :

కరటకా అదియేమి-కథ, కోతి ఎవరు ?
పరుల కార్యాలతో - పాడెందుకయ్యో ?

కరటకుడు :

అనగా అనగ నొక్క - అరుదైన ఊరు—
వనముండె నచ్చట - వర్తకు డొకడు

గట్టి దేవళమొండు - కట్టించుచుండె
పట్టుగా వందలు - పనివారి బిలిచి.

పగటివేళకు వారు - పనులను నిల్పి
భగభగ ఆకలై - పట్టణమ్మునకు
పోయిన సమయాన - ప్రొద్దువోకలకు
వేయారు కోతులు - విసవిస వచ్చె.

కోతులన్నియు జేరి - కొమ్మల మీద
కోతిచేష్టలు జేయ - గుంపులో నొకటి
తోటలో నాడుచు - తుంటరిదగుట
దాటులతో నొక - తట్టున కేగి,

కంబము కోయుచు - కర్మకారుండు
అంబలి కేగిన - యా చోటు జూచి
కోసినదానిలో - గూటమ్ము నడుమ
వేసియుండుట జూచి - వెఱ్ఱి దా కోతి

బడబడ కంబమ్ము-నడుమ గూర్చుండి
గడగడ చేతుల - కదలించె దాని.
కొంతసేపటికేమొ - గూటమ్ము వచ్చె
అంతలో కోసిన - ఆ సందులోన

చిక్కిన ఆ కోతి - శివ శివ అనుచు
ప్రక్కకు పోలేక - ప్రాణాలు విడిచె.
కావున నితరుల - కార్యమ్ములందు
దోవను పోయెడు - దొర పనులందు

వ్రేలుపెట్టుట వట్టి - వెఱ్ఱితనమ్ము
చాలదా మిగిలిన - గాలి నంజుళ్లు?



దమనకుడు :

అది ఏమి మిత్రమా - అది ఏటి మాట
బ్రదుకెల్ల ఎంగిలి - పడుటకేనటర ?
మిత్రుల కొక్కింత - మేల్సేయుకొఱకు
శత్రులకు రవంత - చవిజూపు కొఱకు
కొల్వు సేతురుగాని - కొంచెపు కడుపు
చల్వకోసమ్మెరు - చావరు లెమ్ము.
తెలివి తేటలతోడ - తేజస్సుతోడ
ఇల నొక్క క్షణము జీ-వించిన జాలు.
బ్రతికిన చాలునా ? - పాడు కాకియును
పదులేండ్లు బ్రదుకదా-బలికూడు కొఱకి.
తన వంశమున ప-తాకను బోలువాడు
తనయుడు; కాకున్న - తన పుట్టు వేల ?
తల్లిప్రాయమ్మును - డొల్ల జేయుటకు
వల్లమాలిన పుట్టు - వది ఏలనయ్య ?
ఏటి గట్టున బుట్టు - నీ గడ్డిపోచ
నీట మున్గెడువారి - నిల్పు చేయిచ్చి.
తన శక్తి చూపక - తనయంత తాను
మునుకొని కూర్చున్న - మురిసిపో రెవరు.
కార్యవాదులమయి - కదలి పోవలయు
శౌర్యమ్ము చూపించి - సాగి పోవలయు.

కరటకుడు :

మనము ముఖ్యులము కా-మన్న ఇచ్చోట
వినును ముఖ్యుల మాట-లనె మన రాజు
ఫలమున్న చోటనే - పలుకుట పాడి
తెలి బట్టకే రంగు - పులుముట నేర్పు.

దమనకుడు :

ఎవరు ముఖ్యుల టన్న - దేమున్నదయ్య ?
అపుదురు రాజుల - అనురాగమున్న.
తెలియదా రాజుల - అలవాటు నీకు ?
పలుకరింతురు చెంత - నిలిచినవారి.
విద్య లేకుండిన - వెడగైన సరియె
పద్యమున్నదికదా - పఠియించలేదె ?
"స్త్రీలు రాజులు లతల్ - చేరువవాని
బేలతనమ్ముతో - పెనవేసుకొంద్రు."

కరటకుడు :

సరి, యైనచో నేమి - సాధింతు విపుడు
తఱిజూచి సేయంగ - దలచిన దేమి ?
మనసు మర్మము వీడి - మన మాడుకున్న
వెనుక కర్తవ్యమ్ము - పని చూడవచ్చు.

# వాయుగోళం - వాతావరణం

వాయుగోళంలో మూడు అంతస్తులున్నాయనీ, వాతావరణపు మార్పులన్నీ కింది అంతస్తులోనే జరుగుతాయనీ మనం ఇదివరకే తెలుసుకుని ఉన్నాం. ఈ అంతస్తులో గాలి అంతటా ఒకే వత్తిడి కలిగిలేదు. గాలిలో కళ్ళకు కనిపించని మిట్టలూ, పల్లాలూ, శిఖరాలూ, మైదానాలూ ఉన్నాయి. వీటినిగురించి తెలుసుకోవటం వాతావరణవేత్తల పని.

గాలిలో ఉండే ఈ అదృశ్యరూపాలలో కొన్ని స్థిరమైనవి ఉన్నాయి. ఉదాహరణకు, ఉత్తర దక్షిణ ధృవాలమీద చల్లని గాలి, బరువైనది, బోర్లించిన గిన్నెల ఆకారంలో ఉంటుంది. భూమధ్యరేఖ ప్రాంతంలో ఒక గాలి "లోయ" ఉన్నది. ఇది భూమిని చుట్టి వస్తుంది. ఇందులోనుంచి తేలికైన వెచ్చని తడిగాలి పైకి లేస్తూవుంటుంది.

ఉష్ణమండలం అంచున, భూమధ్యరేఖకు రెండు వైపులా చల్లని గాలి శిఖరాలు చాలా ఎత్తుగా లేస్తున్నాయి. అయితే ఈ శిఖరాలు అవిచ్ఛిన్నంగా భూమిని చుట్టిరాక అక్కడక్కడ తెగి ఉన్నాయి. ఈ శిఖరాలకూ ధృవాలకూ మధ్య అనేకమైన గాలి లోయలున్నాయి.

వాయుగుండాల మూలంగా తుపానులు వస్తాయి. వాయుగుండం నిడివి సుమారు నూరు మైళ్లుండవచ్చు. వాయుగుండం నడిబొడ్డులో గాలిఒత్తిడి తక్కువగా ఉంటుంది. అందుచేత "గుండం" అంచులనుంచి కేంద్రానికి గాలిప్రవాహం సాగుతుంది. చుట్టూరా వుండే కొండలమీది నీరు లోయలోకి దూకుతూ వచ్చిపడ్డట్టుగా పరిసరాలనుంచి గాలి నడిబొడ్డున వుండే "పల్లం"లోకి ప్రవహిస్తుంది. ఇందువల్ల ఈ పల్లంలో అదివరకుండే తేలికైన, వెచ్చని గాలి పైకి లేస్తుంది. ఇలా జరిగినప్పుడాగాలిలో ఉండే ఆవిరి చల్లబడి తీవ్రమైన వర్షం కురుస్తుంది. తీవ్రమైన గాలీ, వానా చేరి అపారమైన నష్టంకలిగిస్తాయి.

వాయుగోళంలో అనేక రకాల పవనాలు కూడా ఉన్నాయి. సూర్యకాంతి భూమినంతటినీ ఒకేవిధంగా వేడెక్కించదు. ఉష్ణమండల ప్రాంతం వేడెక్కినంతగా ధృవప్రాంతాలు వేడెక్కవు. భూమిపై గల ఈ వేడిలో హెచ్చు తగ్గులను సమం చేయటానికి గాలి ప్రయత్నిస్తుంది. ధృవాలనుంచి శీతలపవనాలు భూమధ్యరేఖ ప్రాంతంవేపు వీస్తాయి. వీటిని "వృన్నతవర్తక పవనాలు" అంటారు. ఇవి భూమికి **3,000** అడుగులు లగాయతు **13,000** అడుగుల వరకూ గల ప్రాంతంలో వీస్తాయి.

ఇంతకుముందు చెప్పిన గాలి స్వరూపాలను పురస్కరించుకుని అనేక చిల్లర పవనాలు వీస్తాయి. ఉష్ణమండలం ఉత్తర దక్షిణ వాయు "శిఖరాలకు" రెండు వైపులా గాలి ప్రవహిస్తుంది. అలాగే ధృవాలమీద "బోర్లించి ఉన్న గాలి గిన్నెల" అంచుల వెంబడి పవనాలు బయలుదేరుతాయి. ఈ పవనాలే ఒకప్పుడు నావికులు ఐస్‌లాండ్, గ్రీన్‌లాండ్, ఉత్తర అమెరికా మొదలైనవి కనిపెట్టటానికి తోడ్పడ్డాయి. విమానయానం హెచ్చినకొద్దీ, వాయుగోళంలో గల అదృశ్య స్వరూపాలను గురించీ, వాతావరణపు మార్పులను గురించీ, పవనాలను గురించీ మనం ఇంకా బాగా తెలుసుకోవలిసి వుంటుంది.



# గుడ్డివాడి యుక్తి

పూర్వం కాబూలు నగరంలో ఒక మంగలి ఉండేవాడు. వాడు తన వృత్తి చేసుకుంటూ కొంతకాలం వెళ్ళబుచ్చాక, అకస్మాత్తుగా వాడికి గుడ్డితనం సంప్రాప్తమయింది. అది మొదలు వాడు తన వృత్తి సాగించుకోలేక యాచకవృత్తి అవలంబించాడు. వాడి అదృష్టమేమో గాని వాడు, తాను వృత్తిలో ఉన్నప్పటికంటె బిచ్చమెత్తి యెక్కువ డబ్బు పోగుచేశాడు. క్రమంగా వాడిదగ్గిర నూరు వెండికాసులు చేరాయి. గుడ్డివాడు వాటిని ఒక సంచీలో పోసి కొద్దికాలంపాటు తనవెంటే ఉంచుకున్నాడు.

కాని తనదగ్గిర అంత డబ్బు ఉండటం ప్రమాదమని వాడికి తోచింది. ఆ డబ్బు తనవద్ద వున్నట్టు తెలిస్తే, కళ్ళు లేనివాణ్ణి చేసి ఎవరైనా కాజేయవచ్చు. అదీగాక తాను అంత డబ్బు నిలవచేసినట్టు పైకి పొక్కితే ఎవరూ తనకు ధర్మం చెయ్యరు. అందుచేత గుడ్డివాడు తన కాసుల సంచీని ఎక్కడైనా దాచాలనుకున్నాడు.

మూట దాచటానికి తగిన స్థలంకూడా గుడ్డివాడికి స్ఫురించింది. వాడు మసీదుకు వెళ్ళినప్పుడల్లా ఒక వాకిలి పక్కగా కూచునేవాడు. అక్కడ నేలలో ఒక చిన్న కొయ్యపలక ఉన్నది. అది సరిగా తాపటం కాలేదు. దాన్ని తీస్తే వస్తుంది. ఆ పలక కింద చిన్న గుంట ఉన్నది. అందులో సంచీని దాచవచ్చు.

అందుకుగాను గుడ్డివాడు ఒకనాడు మసీదుకు వెళ్ళి వాకిలిపక్కనే కూచున్నాడు. నమాజ్ అయిపోయాక, అందరూ మసీదు నుంచి వెళ్ళిపోయారని తోచగానే వాడు కొయ్యపలక ఎత్తి, గుంటలో తన కాసుల సంచీ ఉంచి, మళ్ళీ పలక యథాస్థానంలో ఉంచి, మెల్లిగా బయటికి జారుకున్నాడు. అయితే ఒక్క పొరపాటు మాత్రం జరిగి

జి. సూర్యనారాయణ

పోయింది. ఎవరూ మసీదులో లేరని గుడ్డి వాడు అనుకుని సొమ్ము దాచే సమయంలో ఒక మనిషి మసీదులో వుండి, గుడ్డివాడు సంచీ దాచటం చూశాడు. గుడ్డివాడు వెళ్ళి పోగానే ఈ మనిషి కొయ్యపలక తీసి సంచీ పైకి లాగి, అది తీసుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు ఎవరూ లేని తరుణంలో గుడ్డి వాడు మసీదుకు వెళ్ళి తన సంచీ క్షేమంగా ఉన్నదో లేదో అని చూసేసరికి అక్కడ సంచీ లేదు.

మరొకడైతే పోయిన సొమ్ముకోసం ఒక శోకం పెట్టి ఊరుకుని ఉండేవాడు. కాని గుడ్డి మంగలివాడు అసాధ్యుడు. తన సొమ్ము హరించిన వాడెవడో తెలుసుకోవటమే గాక, ఆ సొమ్ము రాబట్టటానికికూడా ఆలోచన చేశాడు. వాడు ఇంటికి వెళ్ళి తన చిన్న కొడుకును పిలిచి, "ఒరే, నాయనా, ఇవాళనుంచీ నావెంట నువుకూడా రా. ఇద్దరం మసీదు బయట కూచుందాం. నువు వచ్చే పోయే వాళ్లని జాగ్రత్తగా గమనించి, నన్ను చూసి ఎవడు నవ్వుతాడో గుర్తుపెట్టుకుని, వాడి ఇల్లెక్కడో తెలుసుకుని నాకు చెప్పు," అన్నాడు.

రెండు రోజులపాటు తండ్రి కొడుకులు మసీదు బయట తిష్ఠవేశారు. రెండో రోజు గుడ్డివాడి కొడుకు, "నాన్నా, నిన్ను చూసి



ఎవరో స్ఫోటకం మచ్చలవాడు నవ్వుతూ లోపలికి వెళ్ళాడు," అని గుడ్డివాడి చెవిలో రహస్యంగా చెప్పాడు.

"వాడు బయటికి రాగానే వెంట వెళ్ళి, ఎక్కడికి పోతాడో, పేరేమిటో తెలుసుకురా," అన్నాడు గుడ్డివాడు.

కొంతసేపటికి గుడ్డివాడి కొడుకు తిరిగి వచ్చి తండ్రి కోరిన వివరాలు తెలిపాడు. ఆ మనిషి ఒక వర్తక వ్యాపారి.

గుడ్డివాడు తడువుకుంటూ ఆ వర్తక వ్యాపారి దుకాణానికి వెళ్ళి, "ఫలాని వారున్నారా?" అని అడిగాడు. వ్యాపారి గుడ్డివాణ్ణి దుకాణంలోకి తీసుకుపోయి, "ఏం, ఇలా వచ్చావు?" అని అడిగాడు.

"రహస్య వ్యవహారం, బాబూ. ఎవరూ లేకుండా చెప్పాలి," అన్నాడు గుడ్డివాడు.

"చెప్పు," అన్నాడు వ్యాపారి.

"తమరు చెబితే నమ్మకపోవచ్చుగాని, బాబూ, నేను యాచన చేసి చాలా సొమ్ము మిగుల్చుకున్నాను. ఒక వందకాసులు మా బంధువులకు అరువిచ్చాను. మరొక వంద ఒక రహస్యస్థలంలో దాచానులెండి. మా బంధువులు రేపు వందకాసులూ తిరిగి ఇచ్చేస్తున్నారు. ఆ వందా, దాచిన వందా కలిపి మొత్తంగా వ్యాపారంలో పెడదామని ఉంది. ఎవరికన్నా వడ్డీకి ఇద్దామంటే



పత్రాలూ, సాక్ష్యాలూ ఉండటంవల్ల నా దగ్గిర డబ్బున్నట్టు పొక్కుతుంది. ఆ తర వాత నాకెవరూ రాగిరోలీ ఇవ్వరు. ఎందు కొచ్చిన బెడద? మీరు వర్తకంలో ఆరితేరిన వారు. అందుచేత సొమ్మంతా మీచేత పెట్టేస్తాను. దానితో మీకిష్టంవచ్చిన సరుకు కొని అమ్మి లాభంలో మీరు సగం తీసుకుని సగం నాకివ్వండి," అన్నాడు.

వ్యాపారి కొంచెం ఆలోచించి, "సరే, సొమ్ము రేపు ఉదయం పట్టుకురా!" అన్నాడు. అయన కొక గొప్ప ఆలోచన తట్టింది. తాను తీసుకున్న పందకాసులు గాక, గుడ్డివాడిదగ్గిర ఇంకొక పందకాసు లున్నాయన్నమాట. మసీదులో దాచిన సంచీ పోయిన సంగతి గుడ్డివాడింకా ఎరగ డల్లే ఉంది. తాను ఈ పందకు ఆశపడ కుండా ఉంటే గుడ్డివాడు రెండువందలు తెచ్చి తన చేతిలో పోస్తాడు. అంతా కలిపి కాజెయ్యవచ్చు. ఒకవేళ గుడ్డివాడు పది మందితో చెప్పినా, వాడిదగ్గిర రెండువందల కాసులు చేరాయని ఎవరూ నమ్మరు.

ఈవిధంగా ఆలోచించి వ్యాపారి తాను కాజేసిన సంచీ తీసుకుపోయి మసీదులో కొయ్యపలకకింద పెట్టేశాడు. దాన్ని ఆ సాయంత్రం గుడ్డివాడు తీసుకున్నాడు.

గుడ్డివాడు మర్నాడు వస్తానన్న ప్రకారం రాలేదు. వర్తకుడు తన దుకాణంనుంచి బయలుదేరి గుడ్డివాణ్ణి వెతుక్కుంటూ మసీదుకేసి వెళ్ళాడు. మసీదు బయట గుడ్డివాడు కనిపించాడు.

"ఏమోయ్? వస్తానని రాకపోతివేం?" అన్నాడు వ్యాపారి.

"ఏంచెయ్యను, బాబూ? అసమర్థుణ్ణి చేసి బంధువులు టోపీ వేశారు. నీకు మేం బాకీ లేం పొమ్మన్నారు! నేను దాచుకున్న సొమ్మేమో ఎవడో దొంగవెధవ కొట్టేశాడు. నా బతుకు వ్యాపారంలాగే వుంది! యా అల్లా! యా ఖుదా!" అన్నాడు గుడ్డివాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 ఆగస్టు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఎవరికోసం వచ్చినారో - ఎరుగజెప్పండీ...

రెండవ ఫోటో : తమరి దర్శన భాగ్య మబ్బెను - ధన్యులముసుండీ !

పంపినవారు : క. గౌ. జానకి, E. తాండ్రపాడు B. O. (కర్నూలు)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




ప్రొఫెసర్ పి. సి. సర్కార్

మనిషి తల "ఖండించటం" ఇంద్రజాలికులు చేసే గొప్ప ప్రదర్శనలలో ఒకటి. కాన్వాస్ అమర్చిన పడక కుర్చీలో ఒక కుర్రవాడు పడుకుంటాడు. ఇంద్రజాలికుడు కుర్రవాణ్ణి హిప్నాటైజ్ చేస్తాడు. పక్కనే బల్లమీద పొట్లం ఆకారంలో చుట్టిన పెద్ద కాగితమూ, పెద్ద, పదునైన కత్తీ, పెద్ద తువాలూ ఉంటాయి. కుర్రవాడికి పూర్తిగా స్పృహ తప్పిపోయాక, ఇంద్రజాలికుడు అతని తలను తువాలులో కప్పి, కత్తితో తెగగోసేసి, తువాలులో ఉండే తలను కాగితం పొట్లంలో ఉంచి, ఆ పొట్లాన్ని తెచ్చి మరొక ఖాళీ బల్లపై పెడతాడు. కాగితం పైకి ఎత్తగానే తెగవేసిన తల బల్లపై కనిపిస్తుంది. ఇది బొమ్మ తల కాదు, రక్తమాంసాలు గల నిజమైన మనిషి తల! అసాధ్యమైన ఈ ట్రిక్కు చూసి ప్రేక్షకులు నివ్వెరపోతారు. పడక కుర్చీలో కుర్రవాడి మొండెం కనిపిస్తూంటుంది, తల మాత్రం ఉండదు. బల్లమీద ఉన్న తలపై కాగితపు పొట్లం మూసి ఆ పొట్లాన్ని తెచ్చి పడక కుర్చీలో ఉండే మొండెముకు చేర్చి, తువాలు కప్పి, అది తీసివేసేసరికి మొండెముకు తల అతికిపోతుంది.

ఇక ఈ ట్రిక్కులో గల మర్మం. దీనికిగాను ముందు ఇద్దరు కుర్రాళ్లను, ఒకే పోలికగలవాళ్లను, సంపాదించాలి. నేను కవలపిల్లల్ని ఉపయోగించేవాణ్ణి. లేదా, ఇద్దరూ ఒకే రకంగా ఉండేటట్టు మేకప్ చేయించవచ్చు. పడకకుర్చీలోనూ, ఖాళీబల్ల పైభాగంలోనూకూడా ట్రిక్కున్నది. ఈ బల్లమీద పరిచే గుడ్డ నేలదాకా వేళ్లాడాలి; లేదా బల్లకింది భాగంలో చెక్కకూర్పయినా ఉండాలి. బల్ల కిందిభాగంలో కుర్రవాడు దాగి ఉండటం ఒక బొమ్మలో చూపబడింది.

బల్ల పైభాగంలో గల కంతలోనుంచి వాడు తల పైకి పెడతాడు. బొమ్మలో పడక కుర్చీలో ఉండే మొండెమూ, కాన్వాస్ కంతలోనుంచి వెనకకు వెళ్లిన తలా కనిపిస్తాయి.




ఒక పెద్ద తువాలుకు మారుగా మూడు నాలుగు చిన్న తువాళ్లు వాడవచ్చు. ఒకటి బల్ల పైభాగంలో కంతను కప్పటానికీ, ఇంకొకటి కాన్వాసులో గల కంతను కప్పటానికీ, ఈవిధంగా అవి ఉపయోగపడతాయి. ఒక కుర్రవాడు మొదటినుంచీ బల్లలోపల దాగి



ఉంటాడు. రెండోవాడు ఇంద్రజాల ప్రదర్శనకు ఉపయోగపడతాడు. తువాలు తలమీద కప్పగానే కుర్చీలో కుర్రవాడు తల వెనక్కు వాల్చేస్తాడు. ఐంద్రజాలికుడు తలను కోసినట్టూ, దానిని కాగితంపొట్లంలో తీసుకుపోయి బల్లమీద పెట్టినట్టూ నటిస్తాడు. కాగితం పొట్లం బల్లమీద పెట్టగానే బల్లలో ఉన్న కుర్రాడు తన తలను ఖాళీ పొట్లంలోకి ఎత్తుతాడు.

## అట్టచివరి బొమ్మ

ఒకరోజు రాజు - 6

"అయ్యో, నావల్ల మీకు అపకారం జరిగిందా? అది నేను బుద్ధిపూర్వకంగా చేసినది కాదు. నా మాట నమ్మండి. మీకు జరిగిన అన్యాయమేదో తెలియజేస్తే నాకు చేతనైన పరిహారం చేస్తాను. విరోధిస్తే చాలా బాధ పడతాను," అన్నాడు ఖలీఫా.

అబూ మెత్తబడ్డాడు. ఖలీఫాను తనవెంట తీసుకుపోయి జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. చొక్కా



విప్పి తన శరీరంమీద ఉన్న కొరడా దెబ్బ వాతలు చూపించాడు. వాటిని చూసి ఖలీఫా చాలా జాలిపడ్డాడు.

ఇద్దరూ కలిసి విందు ఆరగించారు. అనంతరం పానీయాలు సేవించారు. ఆ సమయంలో ఖలీఫా అబూ తాగే పానీయంలో రహస్యంగా మత్తుమందు కలిపాడు. అది తాగుతూనే అబూ స్పృహతప్పి పడిపోయాడు.

మళ్ళీ స్పృహ తెలిసేసరికి అతను రాజభవనంలో ఉన్నాడు. అతని చుట్టూ దాసీపిల్లలు నిలబడివున్నారు.

"ఓ పాపిష్టి దయ్యమా! నన్ను మళ్ళీ ఆవేశించావా?" అంటూ అబూ నిండా ముసుగుతన్ని, నిద్రపోతున్న వాడిలాగా గట్టిగా గురక పెట్టసాగాడు.

గన్నా అతని పక్కనే మంచంమీద కూచుని, "ఏలినవారు నిద్రలేవాలి. ఉదయ ప్రార్థనలకు వేళఅయింది," అని అతన్ని తట్టి లేపింది.

అబూ ముసుగులోనుంచే, "నన్ను ముట్టుకోకు, దయ్యమా!" అన్నాడు.

"నేను దయ్యాన్ని కాను. ఏలినవారి దాసీని, గన్నాను," అన్నదామె.

అబూ ముసుగు తన్నేసి చూట్టూ చూశాడు. ఆ దాసీలందరూ యింకా అక్కడే ఉన్నారు. అతను గన్నాకేసి తిరిగి, "నా వేలు కొరుకు!" అన్నాడు. ఆమె అతని వేలు గట్టిగా కొరికింది.

అబూ బాధతతో గంతులు వేస్తూ, "కలకాదు, నిజమే! నేను ఖలీఫానే!" అంటూ అరవసాగాడు. అతనితోబాటు అందరు దాసీలూ అరుస్తూ చుట్టూచేరి నవ్వసాగారు.

ఇంతలో పొట్ట చేతబట్టుకుని విరగబడి నవ్వుతూ ఖలీఫా అక్కడికి వచ్చాడు. ఆయనను చూస్తూనే దాసీలు నవ్వులు మానేసి ప్రతిమల్లాగా ఎక్కడివారక్కడ నిలిచిపోయారు.

"నువ్విక్కడకూడా దాపరించావా, మోసుల్ వర్తకుడా? చూశావా నీ మూలంగా నాకు మళ్లీ ఈ పీడకల పట్టుకున్నది," అన్నాడు అబూ, ఖలీఫాను చూసి.

ఖలీఫా అతన్ని కౌగలించుకుని, "తమ్ముడూ, ఈసారి పీడకల కాదు. నిన్ను నా పరివారంలో చేర్చుకుని నీకేం కావలిస్తే అది ఇస్తాను," అన్నాడు.

ఆయన ఖలీఫా అనీ, ఆయనే తనను రెండుసార్లూ రాజభవనానికి తీసుకువచ్చాడనీ అబూ అల్ హసన్‌కు ఇప్పుడర్థమయింది. అతను ఖలీఫాకు వంగి సలాముచేసి, "తమ అండతప్ప నాకింకేమీ అవసరంలేదు," అన్నాడు.

"నాకు నీవంటి అల్ప సంతోషుల స్నేహమే కావాలి. నేటినుంచీ నీకు రాజభవనంలో ఒక గది ఏర్పాటు చేస్తున్నాను. ఇకమీదట నీవు రాజభవనానికి రావటానికిగాని, నా గదికి రావటానికిగాని, రాణీ జుబేదా గదికి రావటానికిగాని ఎవరి అనుమతీ అవసరంలేదు," అన్నాడు ఖలీఫా.

ఆయన అబూ అల్ హసన్‌కు పది వేల దీనారాలిప్పించి, దివాణానికి వేళ అయినందున అక్కడినుంచి బయలుదేరి వెళ్ళిపోయాడు.

అబూ పరమానందంతో యింటికి వెళ్లి తల్లికి జరిగినదంతా చెప్పాడు. ఆమె చాలా సంతోషించింది. రోజుకొకసారి వచ్చి చూసిపోతూంటానని తల్లికి మాట ఇచ్చి అబూ రాజభవనానికి తిరిగి వెళ్ళాడు.

(ఇంకా వుంది)





# వార్తలు-విశేషాలు

ద్వితీయ పంచవర్షప్రణాళికలో, దేశంలో టెలివిజన్ సదుపాయాలకు తగిన అవకాశాలు కల్పింపబడగలవు. వార్తా ప్రసారశాఖలకు కేటాయించిన తొమ్మిది కోట్ల రూపాయిలలోను, 40 లక్షలు టెలివిజన్‌కు ప్రత్యేకించబడ్డాయి.

* * * *

ప్లానింగ్ కమిషన్‌వారి తుదినివేదిక ప్రకారం, ద్వితీయ పంచవర్షప్రణాళికలో, దక్షిణాది రాష్ట్రాలకు హెచ్చుమొత్తాలను కేటాయించటం జరిగింది. లోగడ ఆంధ్రరాష్ట్రానికి కేటాయించిన మొత్తాన్ని 116 కోట్ల 20 లక్షలనుంచి, 119 కోట్ల రూయలకు, హైదరాబాదుకు కేటాయించిన మొత్తాన్ని 100 కోట్లనుంచి 100 కోట్ల 20 లక్షల రూపాయలకు పెంచారు.

* * * *

రైల్వేల ఆదాయం హెచ్చించడానికి వీలుగా, టిక్కెట్లులేని ప్రయాణాలను నివారించే నిమిత్తం, తగుచర్యలు గైకొనాలని రైల్వేశాఖ అంచనాల సంఘం, తన నివేదికలో తెలియజేసింది. టిక్కెట్లులేని ప్రయాణీకులమూలంగా, ప్రతి ఏడు రైల్వేల రాబడి రెండు, మూడు కోట్ల రూపాయలవరకు తగ్గగలదని అంచనా వెయ్యబడింది.

* * * *

నార్వేదేశంలో పూడిపోయిన, ఒక అతి పురాతన 'వైకింగ్' నౌకలో దొరికిన బౌద్ధవిగ్రహాన్ని గురించిన వివరాలు సేకరించాలని, ఆ దేశంలోని మన ప్రతినిధివర్గానికి ఉత్తరువుచేయబడింది. ఆ 'వైకింగ్' నౌక నమూనాను, నార్వే పౌరుడొకడు, సిక్కిం మహారాజుకు బహూకరించాడు.



పూర్వం లోకమాన్య బాలగంగాధర తిలక్, లాలా లజపత్‌రాయ్‌గార్లు నిర్బంధంలో వుంచబడిన మాండలే జైలులో, వారి జ్ఞాపకచిహ్నాన్ని ఒకదాన్ని నెలకొల్పాలనే ఇండియా ప్రభుత్వ సూచనను, బర్మాప్రభుత్వం ఆమోదించిందని రాజ్యసభలో వెల్లడించబడింది.

*　　*　　*　　*

ఆంధ్రరాష్ట్రంలో రెండు వరద కంట్రోల్ స్కీములను, ఇండియా ప్రభుత్వం ఆమోదించింది. ఈ స్కీములలో ఒకటి బుడమేరుపై రిజర్వాయర్ ఏర్పాటు, రెండవది కృష్ణానదిలోనికి, బుడమేటినీటి డైవర్షన్ స్కీము.

*　　*　　*　　*

గత సంవత్సరం జులైనుంచి, ఇప్పటివరకు ఇండియన్ రైల్వేలకు వర్షాలవల్ల, వరదలవల్ల 78 లక్షల రూపాయలకుపైగా నష్టం సంభవించినట్టు అంచనావెయ్యబడింది.

*　　*　　*　　*

వచ్చే ఆగస్టుమాసంలోగా, ఆంధ్రరాష్ట్రంలో మరి 20 జాతీయ వికాసకార్యక్రమాలు ప్రారంభించబడగలవు. ఈ కార్యక్రమాలలో పాల్గొనడానికి 280 మంది గ్రామసేవకులు అవసరం కాగలరు. ప్రస్తుతం వీరు జాతీయ వికాసకార్యక్రమ కేంద్రాలలో పొందుతున్న శిక్షణ అప్పటికి పూర్తికాగలదు.

*　　*　　*　　*

బొంబాయికి 32 మైళ్ళ వుత్తరంగావున్న, పాత రేవుపట్టణమైన సోపారాలో క్రీస్తుపూర్వం రెండవ శతాబ్దికిచెందిన శిలావస్తు ఖండాలు, మట్టిపాత్రల శకలాలు దొరికాయి. ఇవి చాలా చరిత్రప్రాధాన్యంగల వస్తువులని వీటిని పరిశీలించిన, బొంబాయిరాష్ట్ర చారిత్రకాధారాల బోర్డు సర్వేకమిటీ సభ్యుడు శ్రీ డి. బి. చితాలే ప్రకటిస్తున్నారు.

*　　*　　*　　*

సోవియెట్ యూనియన్‌లోని ఒక ఫ్యాక్టరీ గుడ్డివారికోసం, చేతిగడియారాలు తయారు చేస్తున్నది. ఈ గడియారాల డయల్సు, గంటలు, నిమిషాలు చూపే ముళ్ళుకూడా ప్రత్యేకంగా నిర్మింపబడతాయుట.



# చిత్రకథ



దాసూ, వాసూలు ఒకరోజు సాయంకాలం, 'టైగర్'ని వెంటపెట్టుకొని, కాలవ కేసి షికారు బయలుదేరారు. వారికి ముందుగా, గొడుగువేసుకొని, ఆ వూరి ముసలిపంతులు నడుస్తున్నాడు. హఠాత్తుగా పెద్ద సుడిగాలి వచ్చి, గొడుగుతో సహా ముసలిపంతులు గాలిలోకి లేచాడు. దాసు పరుగెత్తుకు వెళ్లి, పంతులు కాళ్లు పట్టుకొని, కిందకు లాగసాగాడు. దాసు ఎగిరిపోకుండా, వాసు పట్టు కొన్నాడు. ఇంతలో పంతులుచేతిలోని గొడుగు గాలిలోకి ఎగిరింది. 'టైగర్' పరుగెత్తుకుపోయి దాన్ని పట్టుకొని తెచ్చి పంతులుకు యిచ్చింది. అతడికి, దాసూ వాసూలుచేసిన సహాయంకన్న 'టైగర్' సహాయమే గొప్పగా కనబడింది.



**Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'**



నిర్మలకు
పాఠము...




మాలతియొక్క చిన్ని కుమారుడు మోహన్ ఎల్లప్పుడూ తన ఆటవస్తువులనుక్రిందిఅంతస్థులోని ఇంట్లోకిపడవేస్తుంటాడు- నిర్మల ఇంట్లోకి.






వెంకి మోహన్! నీవుమరొక ఆటవస్తువును పడవేశావు!




నిర్మల ఇంట్లో
మోహన్‌యొక్క ఆటవస్తువుల-ను మాలతికి ఇచ్చివే యగూడదూ?
అప్పుడే కాదు- అతనికి బుద్ధి చెప్పాలి...




తరువాత
చూడు! ఇప్పుడు వారొక తువ్వాలను పడవేశారు!
(ఆలోచిస్తున్నది) ఇదిఎంతో శుభ్రంగా వున్నదే! నాకు ఆశ్చర్యంగా వుంది...




మాలతి ఇంట్లో
నిర్మలా! మోహన్‌యొక్క ఆటవస్తువులను నీవు తిరిగితెచ్చావా!
అవును.- మరి మీరు వాటి లను, కూడా, ఎందుకనగా నిన్నొకటి అడుగ-దలచాను-




దానిని ఎంతో శుభ్రముగానీవెట్లు ఉతికితివి, నాకు-చెప్పు? నీవుడుతుకు-నప్పుడు బాదుట నేనెప్పుడూవిను-టలేదు.
అయితే, నేనుబాదను, ఎందుకనగానేను సన్‌లైట్ సబ్బును ఉపయోగించు చున్నాను




బాదుట బట్టల-ను త్వరగా చిరిగి పోవునట్లు చేయును ఎందుకనగా అది బట్టల పోగులను తెంచును




బాదబడిన బట్ట పెద్దదిగా చూపబడినది.




సన్‌లైట్ సబ్బుయొక్క సమృద్ధ యినమరగ బట్టను-బాదకుండానే శుభ్రముగా ఉతుకును, ఆవిధంగా మీ బట్టలు చాలకాలము మన్ను-నట్లు చేయును.




అదినిజం! సన్‌లైట్ బట్టలను బాదకుండానే తెల్లగాను కాంతివంత-ముగాను ఉతుకును ఆవిధంగా బట్టలు చాలకాలము మన్ను-ను మరియు నాకు డబ్బు కూడ మిగు-లును!




SUNLIGHT
SOAP
SUNLIGHT SOAP

Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

తమరి దర్శన భాగ్యమబ్బెను
ధన్యులము సుండీ

పంపినవారు :
క. గౌ. జానకి, ఇ. తాండ్రపాడు

